నెహ్రూ బాల పుస్తకాలయం

# రస్టీ సాహసాలు


రస్కిన్ బాండ్

అనువాదం

భార్గవీ రావు

చిత్రాలు

సుద్ధసత్వ బాసు







నేషనల్ బుక్ ట్రస్ట్, ఇండియా

# విషయసూచిక

# అద్భుతమైన అమ్మమ్మ వంటిల్లు

అందరి వంటిళ్ళ మాదిరిగా ఇది మరీ పెద్దదేం కాదు. పడక గది, వసారా అంత పెద్దగా కూడా లేదు. కానీ కావలసినంత విశాలంగా అనిపించేది. దీన్ని ఆనుకుని ఒక పెద్ద పొయ్యి వుండేది. అక్కడినుండే అద్భుతమైన తినుబండారాలన్నీ వచ్చేవి- నోరూరించే కబాబులు, కూరలు, చాకొలేట్‌ఫడ్జ్, వేరుశనగ పప్పుతో చేసిన బర్ఫీలు, జెల్లీలు, గులాబ్‌జామున్‌లు, మాంసం పులుసు, మసాలా కూరి వండిన టర్కీలు, చికెన్‌లు, వంకాయలు, వండిన చికెన్‌ను మరొకదాన్లో కూరిన హామ్!

మా అమ్మమ్మ ప్రపంచంలో అందరికంటే వంట చెయ్యడంలో అందె వేసిన చెయ్యి.

మేమున్న ఊరిని డెహరాడూన్ అనేవారు. ఇప్పటికీ అది అక్కడే వుంది. కానీ మన దేశానికి స్వతంత్రం వచ్చాక ఊరు పెద్దదై, హడావుడిగా అనిపిస్తుంది. అమ్మమ్మకు ఆ ఊరి చివర్లో ఒక పెద్ద, స్వంత బంగాళా వుండేది. ఆ బంగళా చుట్టూ రకరకాల చెట్లు- ముఖ్యంగా పండ్ల చెట్లు ఉండేవి. మామిడి, లిచీ, జామ, అరటి, బొప్పాయి, నిమ్మ- ఇవేగాక ఒక పెద్ద పనస చెట్టు కూడా ఉండేది. దాని నీడ ఇంటి గోడ మీద పరచుకుని ఉండేది.

పచ్చని చెట్ల నీడ పడ్డా యిల్లు
పచ్చగా వర్ధిల్లు నిండు నూరేళ్ళు...

అని అమ్మమ్మ అన్న మాటలు నాకు ఇంకా జ్ఞాపకం ఉన్నాయి. ఆమె మాటలు నూటికి నూరుపాళ్ళు నిజం. అస్తమానం ఆవురావురని ఆకలి వేసే నాలాంటి తొమ్మిదేళ్ళ అబ్బాయికి ఆ యిల్లు, ఒక స్వర్గమే!

మా అమ్మమ్మ చేసే బ్రహ్మాండమైన వంటకాలకి, నా అపరిమితమైన ఆకలికీ చక్కగా పొత్తు కుదిరింది. నేను నిజంగా చాలా అదృష్టంతుణ్ణనే చెప్పుకోవాలి. ఎందుకంటే అందరికీ అంత అద్భుతంగా వండిపెట్టే దేవతలాంటి అమ్మమ్మలు వుండరు కదా? (దేవతలు నిజంగా వంట చేస్తారా? ఏమో!)

మా బోర్డింగ్ స్కూల్లో చలికాలం సెలవులిచ్చే వారు. నేను ప్రతి సెలవుల్లోనూ ఒక నెల మా అమ్మమ్మ దగ్గర వుండి, ఆ తర్వాతే మా అమ్మా నాన్నల దగ్గరకు వెళ్ళేవాణ్ణి. మా నాన్నగారు అస్సాములోని టీ తోటలో మేనేజరుగా వుండేవారు. ఆ టీ తోటల్లో తిరగడం సరదాగానే ఉండేదికానీ మా అమ్మకి వంట వచ్చేది కాదు. అక్కడ జీతం యిచ్చి ఒక వంటవాణ్ణి కుదుర్చుకున్నారు. అతనికి ఒక మాంసం కూర తప్ప యింకేమీ వండటం వచ్చేది కాదు. రెండుపూటలా అదే తినాలంటే విసుగొచ్చేది- అందులో నాలాగా రకరకాలుగా తినాలని మోజున్న కుర్రాడికి.

అందుకే నేను సగం సెలవులు అమ్మమ్మ దగ్గరే గడిపేవాణ్ణి. నేను వేళ్తే మా అమ్మమ్మ కూడా సంతోషించేది. ఎందుకంటే చాలా వరకు తను ఒక్కత్తే ఉండేది. ఒకత్తే అంటే ఒక్కతే కాదు... కాంత, అని తోటమాలి ఔట్ హౌస్ లో ఉండేవాడు. అతనికి మోహన్ అని నా ఈడువాడే ఒక కొడుకు ఉండే వాడు.'సూజీ' అని పెద్ద పెద్ద నీలికళ్ళ, 'సయామీస్' జాతి పెంపుడు పిల్లి ఉండేది. ఇదేకాక 'క్రేజీ' అనే మాంగ్రేల్ జాతి పెంపుడు కుక్క కూడా ఉండేది. అది అస్తమానం ఇంటి చుట్టూ చక్కర్లు కొడుతూ వుండేది.

వీళ్ళేకాక, మా అమ్మమ్మ మేనల్లుడు కెన్ మామయ్య కూడా ఉండేవాడు. అతనికి ఉద్యోగం పోయినప్పుడల్లా (అతనికి అస్తమానం ఉద్యోగం పోతూనే ఉండేది) లేదా చక్కటి భోజనం కావాలనిపించినప్పుడల్లా అమ్మమ్మ ఇంటికొచ్చేసేవాడు.

ఇలా చూస్తే, అమ్మమ్మ ఎప్పుడూ ఒంటరిగా లేదు. అయినా నేను వెళ్ళడం ఆమెకు సంతోషంగా ఉండేది. ఆమెకెప్పుడూ వేరేవాళ్ళకు వండి పెట్టడం సరదా! తనకంటూ ఏమీ వండుకునేది కాదు. ఆమె వంటల్ని కుక్క, పిల్లి, కెన్ మామయ్య అందరూ మెచ్చుకున్నా ఆవిడకంత తృప్తిగా అనిపించేది కాదు. చక్కగా వండేవాళ్ళకి, నాలాగా సుష్టుగా, ఏది పెట్టినా తినే కుర్రాళ్ళే ఉండాలి.

సాధారణంగా ఏదైనా కొత్తవంట చేసినప్పుడు దాన్ని నాకు పెట్టి, నేను తిని, నాఅభిప్రాయం చెప్పేవరకూ ఆమెకు తోచేది కాదు. నా అభిప్రాయాల్ని జాగ్రత్తగా ఒక పుస్తకంలో రాసుకుని మళ్ళీ వండేటప్పుడు జాగ్రత్త పడేది. నేను రెండు సార్లు నోట్లో పెట్టుకోగానే-

"నచ్చిందా?" అని అడిగేది.

"బావుందమ్మమ్మా."

"తీపి సరిపోయిందా?"

"సరిపోయింది."

"మొహం మొత్తేట్టుగా లేదు కదా?"

"లేదమ్మమ్మా."

"ఇంకొంచెం పెట్టనా?"

"పెట్టు."

"సరే, ఇదికానిచ్చేయ్."

"ఊం...!" (గారంగా)

**బాతు వేపుడు**

ఇది అమ్మమ్మ స్పెషల్ వంటకాల్లో ఒకటి.

నేను మొదటిసారి ఈ వేపుడు రుచి చూసినప్పుడు అమ్మమ్మ యింట్లో కెన్ మామయ్య కూడా ఉన్నాడు.

అప్పుడతను చేస్తున్న రైల్వేగార్డు ఉద్యోగం పోయింది. మరో ఉద్యోగం దొరికే వరకూ అమ్మమ్మ దగ్గర ఉండాలని వచ్చాడు. అలా వచ్చినప్పుడల్లా చాలా రోజులు అక్కడే ఉండి పోయేవాడు. అలాంటప్పుడు అమ్మమ్మ అతనికి పాద్రీదాస్ అకాడెమీలో చిన్న పిల్లలకు పాఠాలు చెప్పడానికి అసిస్టెంట్ మాస్టారుగా ఉద్యోగం ఇప్పిస్తాననేది. అలా అనగానే కెన్ మామయ్య వెళ్ళిపోయే వాడు. కెన్ మామయ్యకు చిన్న కుర్రాళ్ళంటే నచ్చేది కాదు. వాళ్ళని చూస్తే ఒక రకమైన భయం. నన్ను చూసినా అతనికి భయమే. కానీ నేనిక్కడ ఒక్కణ్ణే. అందులో అతని కండగా అమ్మమ్మ కూడా వుండేది. కానీ పాద్రీదాస్ అకాడెమీ లో నూరుమందికి పైగా కుర్రాళ్ళుండేవాళ్ళు.

కెన్ మామయ్య కూడా నాకు వేసినంతే ఆకలి వేసేది. అవురావురుమంటూ తినేవాడే కానీ, అమ్మమ్మ వంటల్ని ఎప్పుడూ మెచ్చుకునేవాడు కాదు. అందుకే నాకు అతని మీద అప్పుడప్పుడూ కోపం వచ్చేది. కొన్నిసార్లు ఈ విషయం మీద అతన్ని సరదాగా భయపెట్టే వాడిని కూడా!

కెన్ మామయ్య కళ్ళద్దాలు ముక్కుమీదకు జారిపోతుండగా పళ్ళెంలోని బాతువేపుడు వంక చూశాడు.

"ఊం... మళ్ళీ బాతు వేపుడేనా ఆంటీ?"

"ఏమిటి నీ ఉద్దేశ్యం- మళ్ళీ బాతేనా అని అడగటంలో? నువ్వు క్రితం నెలలో ఇక్కడికి వచ్చినప్పుడు తిన్నదేగా?"

"నేచెప్పేదీ అదే. కానీ నీవు చాలా రకరకాల వంటలు చేస్తావు కదా, ఆంటీ" అన్నాడు కెన్ మామయ్య.

అలా అంటూనే గరిటతో రెండుసార్లు చాలా కూర వడ్డించేసుకున్నాడు. నేను వేసుకునేటప్పటికీ సగం కూర అయిపోయింది. అతని మీద కసికొద్దీ ఆపిల్ సాస్ అంతా నేనే పోసేసుకున్నాను. అంకుల్ కెన్‌కి నాకు బాతు కూరంటే ఇష్టమని తెలుసు. అలాగే అతనికి ఆపిల్ సాస్ అంటే ప్రాణమని నాకూ తెలుసు. ఏదోవిధంగా ఇద్దరం సరిపెట్టుకున్నాము.

"మీ అమ్మా వాళ్ళ దగ్గరకు ఎప్పుడు వెళుతున్నావు?" జామ్ టార్ట్ తింటూ యధాలాపంగా అడిగాడు.

"నేనీ సంవత్సరం వెళ్ళకపోవచ్చు. నీకు ఉద్యోగం ఎప్పుడు వస్తుంది మామయ్యా?" అని అడిగాను.

"నేను ఒక రెండు నెల్లు రెస్ట్ తీసుకుందామనుకుంటున్నాను."

నేను గిన్నెలు తొమడంలో, వంటల్లు సర్దడంలో అమ్మమ్మకూ, ఆయాకు సాయం చేసేవాణ్ణి. ఆ టైములో అంకుల్ కెన్ వరండాలో కూర్చుని ఒక చిన్న కునుకు తీయడమో లేదా రేడియో లో వచ్చే డాన్స్ పాటలు వినడమో చేసేవారు.

"అమ్మమ్మా, నీకు కెన్ మామయ్య అంటే ఎందుకిష్టం?" అని అడిగాను ఒకరోజు. అప్పుడు అమ్మమ్మ మామయ్య పళ్ళెంలోంచి ఎముకల్ని తీసి

కుక్క అన్నంతినే గిన్నెలో వేస్తోంది. ఏమీ జవాబు చెప్పలేదు.

"అతను నా మామయ్య కాకుండా, ఇంకెవరి మామయ్యయినా అయితే బావుండేది," అన్నాను.

"అతనేం చెడ్డవాడు కాదులే. కొంచెం ఎక్సెంట్రిక్‌గా ఉంటాడంతే."

"ఎక్సెంట్రిక్ అంటే?"

"కొంచెం తలతిక్క అని అర్థం."

"తల తిక్క అంటే మన కుక్కలాగా ఇంటి చుట్టూ పరిగెత్తాలిగా. మామయ్య అలా పరిగెత్తడం నేనెప్పుడూ చూడలేదే?" అన్నాన్నేను.

* * *

కానీ ఒక రోజు చూసాను.

ఆ రోజు నేనూ, మోహన్ మామిడి చెట్టు కింద గోలీలాడు కుంటున్నాము. ఒక తేనేటీగల గుంపు మామయ్యను తరుముకొస్తుంటే ఇంటిచుట్టూ పిచ్చిగా పరిగెత్తుతున్నాడు. అతను ఒక చెట్టు కింద కూర్చుని సిగార్ కాల్చుకుంటున్నాడు. ఆ సిగార్ పొగకి ఆ చెట్టు మీదున్న తేనెతుట్ట కదిలి, ఆ తేనెటీగలు అతని మీద పడినట్టున్నాయి. కెన్ మామయ్య ఒక్క ఉదుట్లో ఇంట్లోకెళ్ళి నీళ్ళ తొట్టి లోకి గెంతేసాడు. అప్పటికే అతన్ని కొన్ని తేనెటీగలు కుట్టినట్టున్నాయి. మూడు రోజులు పక్క మీదనుండి లేవలేకపోయాడు. ఆయా అతనున్న చోటికే పళ్ళెంలో భోజనం వడ్డించి పట్టుకెళ్ళేది.

"అంకుల్ కెన్ అంతా వేగంగా పరిగెట్టగలడని నాకింత వరకూ తెలీదమ్మమ్మా" అన్నాన్నేను.

"అది ప్రకృతిలో సహజమైన న్యాయం లేరా?" అంది అమ్మమ్మ.

"అంటే ఏమిటి?"

"అంటే ప్రకృతి నేర్పించే పాఠం అన్నమాట. ఇప్పటికైనా మామయ్యకు తాను బాగా పరిగెత్తగలనన్న విషయం తెలిసింది కదా?"

# అమ్మమ్మ చేసే పచ్చళ్ళు

అమ్మమ్మ ఎప్పుడు చాకొలేట్ ఫడ్జ్ చేసినా, వెనిల్లా ఫడ్జ్ చేసినా తోటమాలి కొడుకు మోహన్‌కు పెట్టమని నాకిచ్చేది.

వారింట్లో ఎవరూ మాంసం తినేవాళ్ళు కాదు. అందుకని వారికి బాతు వేపుడు కానీ, చికెన్ గానీ పెట్టి లాభం లేదు. కానీ మోహన్‌కి తీపి వంటలంటే చాలా యిష్టం. గులాబ్ జామ్‌లు, రసగుల్లాలు, జిలేబీలే కాకుండా అమ్మమ్మ చేసే ఇంగ్లీషు స్వీట్లు కూడా తినేవాడు.

మేమిద్దరం పనసచెట్టు కొమ్మమీద కూర్చుని ఫడ్జ్, పిప్పరమెంట్లు, జీళ్ళపాకం లాంటి టాఫీలు తినేవాళ్ళం. మాకు పనసపండు తినడం తెలీదు. దాన్ని కూరలా వండినప్పుడో, పచ్చడి పెట్టినప్పుడో అయితే తినేవాళ్ళం. కానీ చెట్టెక్కడం మాత్రం చాలా సరదాగా వుండేది. ఆ చెట్లో ఉడుతలు, ఓ రెండు జతలు చిలకలు, ఇంకేల్ పక్షులూ భలేగా అనిపించేవి. ఆ చెట్టు మీద ఉడతలు మాతో జతకట్టి మా చేతుల్లోవి తీసుకుని తినేంత స్నేహితమయ్యాయి. వాటికీ మా అమ్మమ్మ చేసిన చాకొలేట్ ఫడ్జ్ అంటే చాలా ఇష్టం. వాటిల్లో ఒక బుల్లి ఉడుత నా జేబులోకి దూరి, నా జేబులో ఏమున్నాయో కూడా చూసేది.

నాకూ మోహన్‌కీ చెట్లెక్కడమంటే సరదా. తోటలోని ఏ చెట్టైనా సులువుగా ఎక్కేసేవాళ్ళం. మా అమ్మమ్మ మమ్మల్ని పిలవాలనుకున్నప్పుడు వరాండాలోనుంచి గానీ, వంటింట్లోనుంచి గానీ లేదా వెనుకనున్న

బాత్‌రూమ్‌లోనుంచి గానీ కేకేసేది. ఇంటి చుట్టూ చెట్లున్నందువల్ల మేం ఏ చెట్టు మీదన్నామో ఆవిడకు తెలిసేది కాదు. కానీ కొన్నిసార్లు క్రేజీ మేమెక్కిన చెట్టు కిందకు వచ్చి మొరిగి మమ్మల్ని పట్టిచ్చేసేది.

పళ్ళు కోయడం ఎప్పుడూ మోహన్ చేసేవాడు. మామిడి పళ్ళు, లిచీస్ ఎప్పుడూ వేసంగిలోనే కాస్తాయి. అప్పుడు నేను బోర్డింగ్ స్కూల్లో వుండేవాణ్ణి. అందుకని పళ్ళు కోయడంలో అమ్మమ్మకు నా సహాయం లేకపోయేది. బొప్పాస పళ్ళు మాత్రం శీతాకాలంలోనే కాసేవి. కానీ ఆ చెట్లు సన్నగా, పొడుగ్గా. పెళుసుగా ఉంటాయి. ఎక్కడానికి రాదు. ఓ పెద్ద కర్రతో కొట్టాలి కానీ కింద పడకుండానే పట్టుకోవాలి.

మోహన్ పళ్ళు కోయడంలో అమ్మమ్మకు సాయం చేసేవాడు. ఆవిడ పచ్చళ్ళు మా వాళ్ళల్లో ప్రసిద్ధి. మామిడి కాయ; ఊరగాయ, నూనెలో వేసి నిలవపెట్టింది, అందరికీ యిష్టం. అలాగే ఆవిడ కారంగా పెట్టే నిమ్మ పచ్చడి కూడా. ఇవే కాకుండా టర్నిప్స్, కారెట్స్, కాలీఫ్లవర్, మిరపకాయలు, పళ్ళూ, కూరగాయలతో కూడా పచ్చళ్ళు పెట్టేది. చిక్కుడు గింజల దగ్గర్నుంచీ పనసపళ్ళ దాకా దేన్నయినా పచ్చళ్ళగా మార్చేసేది. కెన్ మామయ్యకి పచ్చళ్ళంటే అంత యిష్టం లేదు. నేనే అస్తమానం పచ్చళ్ళు చేయమని బతిమాలేవాణ్ణి.

నాకు తీపి పచ్చళ్ళన్నా, సాస్‌లన్నా యిష్టం కానీ కారంగా వున్న పచ్చళ్ళను కూడా తినేవాణ్ణి. ఒకసారి శీతాకాలంలో అమ్మమ్మ దగ్గర డబ్బు చాలా తక్కువగా వున్నప్పుడు, నేనూ మోహన్ ఇంటింటికీ వెళ్ళి అమ్మమ్మ పెట్టిన పచ్చళ్ళు అమ్మి డబ్బు సంపాదించాము.

పెంపుడు కుక్కా, పిల్లీ- చుట్టాలూ పక్కాలూ అందరికీ వండి వార్చే మా అమ్మమ్మ దగ్గర డబ్బు అంతంత మాత్రంగానే వుండేది. ఆమెకు తాతగారిచ్చిన ఆ యిల్లు తప్ప బ్యాంకులో డబ్బు వుండేది కాదు. మామిడి కాయలు అమ్మితే ఏటా కొంత డబ్బు వచ్చేది. తాతయ్య రైల్వే లో పని చేశావారట. ఆయన ప్రయత్నం వల్లే డెహరాడూన్‌కి రైల్వే లైను వేశారట. ఆయన పెన్షన్ కూడా వచ్చేది. ఇవి కాకుండా ఆవిడకు ఇంకేమీ ఆదాయం ఉండేది కాదు. ఇప్పుడు ఆలోచిస్తే ఒక్క కూరతో, ఒక తీపి పిండి వంటతో

మామూలు వంటను పండగ భోజనంగా మార్చే మా అమ్మమ్మ పాక కళానైపుణ్యమే అనిపిస్తుంది.

మా అమ్మమ్మకు పచ్చళ్ళు అమ్మి పెట్టడం నాకేమీ చిన్నతనంగా అనిపించేది కాదు. ఒక బుట్టలో సీసాలన్నిటినీ సర్దుకుని మా చుట్టు పక్కలవున్న ఇళ్ళ వద్దకు వెళ్ళి కొంటారా అని అడిగేవాళ్ళం.

మా వీధిలోనే ఎదురుగా వున్న మేజర్ క్లార్క్ మా మొదటి బోణీ. రాగిరంగు జుట్టులో, ఎర్రటి కళ్ళలో ఎప్పుడూ నవ్వుతూ గమ్మత్తుగా కనిపిస్తాడు.

"రస్టీ, ఏమిట్రా అవీ?" అని అడిగాడు.

"పచ్చళ్ళండీ."

"పచ్చళ్ళా! మీరు పచ్చళ్ళు చేస్తున్నారా?"

"నేను కాదండీ. మా అమ్మమ్మ చేసినవి. మేము అమ్ముతున్నాం. వచ్చిన డబ్బు తో క్రిస్టమస్ పండగకు టర్కీ కొనొచ్చని."

"ఓ, మిసెస్ బాండ్ తయారు చేసిన పచ్చళ్ళా! మీరు ముందుగా నా ఇంటికి రావడం చాలా మంచిదయింది. ఎందుకంటే ఇంకాసేపట్లో బుట్ట తప్పకుండా ఖాళీ అయిపోతుంది. మీ అమ్మమ్మ లాగా పచ్చళ్ళెవరూ చేయలేరురా అబ్బాయ్! ఈ మాట నేనెప్పట్నుంచో చెప్తున్నాను. వంటచేత కాని వాళ్ళే ఎక్కువున్న ఈ రోజుల్లో ఆవిడ మనకు దేవిడిచ్చిన వరం. మా ఆవిడ ఇంట్లో లేదు కాబట్టి మీతో ఇలా మాట్లాడగలుగుతున్నాను. ఇలారా... ఏమున్నాయి మీదగ్గర? కారం కూరిన మిరపకాయల పచ్చడి ఉందా? ఉండే ఉంటుంది. అది నా కిష్టమని మీ అమ్మమ్మకు తెలుసు. ఆ పచ్చడి లేదంటే నాకు బాధగా ఉంటుంది."

నిజానికి బుట్టలో మూడు సీసాల మిరపపచ్చడి వుంది. మేజర్ క్లార్క్ ఆ మూడు సీసాలనూ కొన్నాడు.

అక్కణ్ణుంచీ మేము మిస్. కెల్నర్ ఇంటికి వెళ్ళాము. కానీ ఏమీ లాభం లేదు. ఆవిడకు కారం పడదట. అందుకని ఆమెను పచ్చళ్ళు కావాలా అని అడగలేదు. కానీ ఆవిడ ఒక సీసా లో నిలువవుంచిన అల్లం కొంది. అంతే కాకుండా నాకొక ప్రార్థనా పుస్తకం, ప్రేయర్ బుక్ యిచ్చింది. నేనెప్పుడు

ఆవిడను చూడ్డానికి వెళ్ళినా అదే పుస్తకం యిచ్చేది.

ఆ వీధిలోనే కొంచెం ముందుకు పోతే డాక్టరు దత్తుగారిల్లు. ఆయన ఒక ఆస్పత్రిలో డాక్టరుగా పని చేస్తారు. ఒంటికి మంచిదని చెప్పి ఆయన మా దగ్గర వున్న చాలా నిమ్మకాయ పచ్చడి సీసాలని తీసికొన్నారు. ఆ పక్కన వున్న హరిగారికి స్వంత గారేజి వుండేది. వారు రెండు సీసాలు ఉల్లిపాల పచ్చడి కొన్నారు. వచ్చే నెల్లో మరో రెండు సీసాలు తెమ్మని మరీమరీ చెప్పారు.

రోజూ ఇంటికెళ్ళేటప్పటికి బుట్ట ఇంచుమించుగా ఖాళీ అయ్యేది. క్రిస్మస్ పండగ లోపల ఇరవై ముప్ఫై రూపాయలు వచ్చాయి. ఆ రోజుల్లో ఆ మొత్తానికే టర్కీ వచ్చేది.

కెన్ మామయ్య క్రిస్మస్ పండుగకు అక్కడే ఉన్నాడు. టర్కీలో చాలా భాగం అతనే కానిచ్చేసాడు.

* * *

"ఇప్పటికైనా ఏదైనా ఉద్యోగం చూసుకోరా!" అంది అమ్మమ్మ ఒక రోజు కెన్ మామయ్యతో.

"డెహరాడూన్‌లో ఎక్కడా ఉద్యోగాలు లేవు" అన్నాడు మామయ్య పితూరీ చెప్తున్నట్టుగా.

"అదేం మాటరా? నువ్వు శ్రద్ధగా వెదకావా? పోనీలే! నువ్వెల్లకాలం ఇక్కడే వుండాలని ఏముందీ? మీ అక్కయ్య ఎమిలీ లక్నో స్కూల్లో హెడ్‌మిస్ట్రెస్‌గా ఉంది కదా! అక్కడికెళ్ళు. వాళ్ళ స్కూల్లో హాస్టలు వార్డెనుగా పెట్టిస్తానని అప్పుడెప్పుడో చెప్పింది."

"ఛా అంటే, హాస్టల్లో వుండే నలభై యాభైమంది మతిలేని పిల్లల్ని కనిపెట్టుకుని ఉండాలా? నా వల్లకాదు."

"మతిలేని వాళ్ళంటే?" అడిగాను నేను.

"నోర్మూయ్" అని గద్దించాడు కెన్ మామయ్య.

"మతిలేని వాళ్ళంటే పిచ్చివాళ్ళని అర్థం" అంది అమ్మమ్మ.

"పిచ్చి అంటే నరిపోతుందిగా- అంటే కుక్క క్రేజీ లాగా, కెన్

మామయ్య లాగా కదూ?" అన్నాన్నేను.

మామయ్య నా చెవి గట్టిగా మెలి పెట్టాడు.

"మీ మామయ్యకు పిచ్చి కాదురా, బద్ధకం అంతే" అని సర్ది చెప్పింది అమ్మమ్మ.

"ఎక్సెంట్రిక్ అన్నావు కదా?ఎక్సెంట్రిక్ ..." నోరు జారాను నేను.

"ఎవర్రా అన్నది నేను ఎక్సెంట్రిక్" అని నిలదీసాడు మామయ్య.

"మిస్.లెస్లీ" చిన్న అబద్ధం చెప్పాను నేను. ఎందుకంటే మామయ్యకు లెస్లీ అంటే ఇష్టమని నాకు తెలుసు. డెహరాడూన్ లోని పెద్ద బజారు వీధి లో బ్యూటీ పార్లరు నడుపుతోంది లెస్లీ.

"నువ్వు అబద్ధం చెప్తున్నావు. లెస్లీనెప్పుడు కలిసావు నీవు?" అని నిలదీసాడు మామయ్య.

మొన్న మా దగ్గర ఒక సీసా పుదీనా పచ్చడి కొంది ఆమె. నాక్కూడా ఈ పచ్చడి ఇష్టమని చెప్పాను. కానీ ఆ పచ్చడి ఆమె మిస్టర్, హ్యాటన్ కొరకు కొన్నాననీ, అతను తన్ను తీసికెళుతున్నాడనీ చెప్పింది.

# ఏ పనీ చెయ్యని కెన్ మామయ్య

కెన్ మామయ్య కు అనుకోకుండా ఉద్యోగం దొరకడం మాకందరికీ ఆశ్చర్యాన్ని కలిగించింది. డెహరాడూన్ చూడ్డానికి వచ్చే టూరిస్ట్‌లకు ఊరు చూపించే 'గైడ్' ఉద్యోగం -అదీ పార్ట్ టైం.

మా ఊళ్ళోని నది ఒడ్డున ఒక పాతకోట, ఇంకా కొంచెం ముందుకు పోతే పదహారవ శతాబ్దం నాటి ఒక హిందువుల దేవాలయం ఉండేవి. అక్కన్నుండి ఓ పదిమైళ్ళ కొండలున్న దిక్కుగా పోతే వేడి నీళ్ళబుగ్గలుండేవి. వీటిని "హాట్ సల్ఫర్ స్ప్రింగ్స్" అంటారు.

కెన్ మామయ్య ఆరుగురు అమెరికన్ దంపతులున్న ఒక పార్టీని వేడినీళ్ళ బుగ్గ దగ్గరకు తీసుకెళ్తున్నానని చెప్పాడు. ఎట్టకేలకు మామయ్యకు ఏదో ఒక వ్యాపకం దొరికినందుకు అమ్మమ్మ ఎంతో సంతోషించింది. ఒక పెద్ద సంచి నిండా హామ్ సాండ్ విచస్, ఇంట్లో తయారు చేసిన బిస్కెట్లు, ఓ డజను ఆరెంజ పండ్లు, ఇంకా ఏవో సరంజామా అన్నీ సర్ది ఒక రోజుకి సరిపడేవి యిచ్చింది.

సల్ఫర్ స్ప్రింగ్స్ మా ఇంటి నుండి ఓ పదిమైళ్ళకంటే ఎక్కువుండదు. కానీ అక్కడికెళ్ళిన మా మామయ్య మూడు రోజుల దాకా తిరిగి రాలేదు.

నాలుగో రోజు మొహం వేళ్ళాడదీసుకుని, మట్టి కొట్టుకు పోయిన బట్టలలో, పిచ్చివాడిలాగా తిరిగొచ్చాడు ఇంటికి. కళ్ళు పీక్కుపోయి, నెత్తిమీది బట్టతల వున్న మేరా ఎర్రగా కందిపోయి జబ్బు పడిన వాడిలా

కనిపించాడు.

"ఏమయిందిరా? ఏమిటలా వచ్చావు?" అని అడిగింది అమ్మమ్మ.

అక్కడ వరండాలో వాలు కుర్చీలో చతికిలపడి-"ఆకలితో ప్రాణం పోతోంది, తినడానికేమైనా పెట్టవే" అన్నాడు.

"నీతో పట్టికెళ్ళినవన్నీ ఏమయ్యాయి!"

"నాతో కలసి మేము ఏడుగురం. అన్నీ మొదటి రోజే ఖాళీ అయి పోయాయి."

"అది సరే, నేను ఒక్కరోజుకి సరిపోయావే యిచ్చాను. మీరు వెళ్తానన్నది సల్ఫర్ స్ప్రింగ్స్‌కి కదా?"

"అవును, అక్కడినే బయలు దేరాము కానీ ఆ గుట్టల్లో దారి తప్పి పోయాము."

"దారి తప్పిపోవడానికేముంది. నది ఒడ్డునుంచీ నేరుగా వెళ్ళి గుట్టపైకెక్కితే అక్కడే వుంది కదా...నీవు గైడువి. నీవెన్నిసార్లో వెళ్ళావు కదా? నీకు తెలియకపోతే ఎలా?"

"నిజమే, నేను చాలాసార్లు చూసాను. కానీ ఈసారి దారి తప్పి పోయింది. నేను వాళ్ళని వేరే ఏదో గుట్టపైకి తీసికెళ్ళాను. అక్కడ నది పారుతోంది. కొంచెం ముందుకెళితే వస్తుందని అలా అలా నడిస్తే అక్కడ లేదు... ఇంకొంచెం ముందుకు నడిచి కిందికి చూస్తే తప్పు దారిన వచ్చామని తెలిసింది. చేసేదేంలేక ఆ రాత్రి అక్కడే ఉండిపోయాం. తలదాచుకుందుకు ఎక్కడా చూరు కూడా లేదు. పైన ఆకాశం, నక్షత్రాలు. ఎముకలు కొరికే చలి. ఉదయం లేచి మస్సూరి వెళ్ళి దగ్గర దారిగుండా తిరిగొద్దామనుకుంటే కెమ్టీ వచ్చింది... మళ్ళీ ఇటునుండి కిందకు వచ్చి రోడ్డుపైన వెళ్తున్న బస్సును పట్టుకుని వచ్చి చేరాము."

నేను అమ్మమ్మా కలిసి పక్కసర్ది కెన్ మామయ్యను పడుకోబెట్టాము. అమ్మమ్మ వేడివేడిగా ఉల్లిపాయలు సూప్ పెట్టిచ్చింది. నేనే దాన్ని ట్రేలో పెట్టుకుని అతని గదికి తీసికెళ్ళి ఇచ్చాను. నచ్చినట్టుగా మొహం పెట్టాడుగానీ మళ్ళీ కావాలని అడిగి తెప్పించుకున్నాడు.

ఆ తరువాత రెండురోజులు మామయ్య పడక దిగలేదు. నేనూ, ఆయా వంతుల వారీగా అతనికి భోజనం పట్టుకెళ్ళేవాళ్ళం. మేం చేస్తున్నందుకు అతన్లో కృతజ్ఞత ఏమీ కనిపించేది కాదు... కొందరు మామయ్యలు అంతే కాబోలు!

*             *             *

"బాగా తినాలి గానీ, ఎక్కువగా తినకూడదు. మంచి భోజనం మనకు దేవుడిచ్చిన వరం. దానిని మనం సరిగ్గా వాడుకోవాలి," అని అమ్మమ్మ ఎప్పుడూ చెప్తూండేది.

భోజనం అలవాట్లను గురించిన సామెతలను కొన్నింటిని రాసి వంటింటి తలుపు మీద అతికించింది. వాటిని చదవడం అంటే ఆ ఎత్తులో అవి నాకు కనిపించేవి కావు. కెన్ మామయ్య క్కూడా అవి చదవడానికి వీలుగా ఉండేవి కాదు. అతను వంగి చదావాల్సి వచ్చేది.

అల్పాహారం ఆయుష్యవృద్ధి.

ఖాళీ పళ్ళెం కంటే ఒక చిన్న చేపవున్నా నయమే.

ఏం చేయాలన్నా నేర్పు వుండాలి-పారిడ్జ్ అయినా సరే!

తినడం, త్రాగడం ద్వారా మనిషి తన ఆలోచనాశక్తిని మరువరాదు.

బయట దొరికే పరమాన్నం కంటే, ఇంట్లో వండుకునే గంజిమేలు.

మంచి భోజనం మేధస్సునూ, మనస్సునూ ఆహ్లాదపరుస్తుంది.

నీ నాలుక నీ గొంతును కోయకుండా చూసుకో.

*             *             *

కెన్ మామయ్య తన జుట్టు వూడి పోతుందనీ, బట్టతల వచ్చేస్తుందనీ బాధపడడం మొదలెట్టాడు. అమ్మమ్మ తన పుస్తకాలను వెదికి ఘెర్‌కిన్ ను బ్రాందీలో నానబెట్టి తలకు రుద్దుకుంటే జుట్టు మొలుస్తుందని చెప్పింది.

మరుసటి రోజు ఘెరికిన్‌లను తెప్పించి ఒక వారం రోజులు బ్రాందీ లో నానబెట్టి కెన్ మామయ్యకు ఇచ్చింది-రోజూ బట్టతల ఉన్నచోట ఉదయం పూటా, రాత్రి పూటా కూడా రుద్దమని.

మరుసటి రోజు మామయ్య గదిలోకి వెళ్ళి చూస్తే సీసాలో ఘెర్‌కిన్

మాత్రమే ఉంది. మామయ్య బ్రాందీ అంతా తాగేసాడు.

* * *

కెన్ మామయ్యకు ఈల వెయ్యడమంటే సరదా.

జేబులో చేతులు పెట్టుకుని, ఇంట్లోనూ, తోటలోనూ పచార్లు చేస్తూ ఈల వేసుకుంటూ తిరుగుతుంటాడు పనేమీ లేనప్పుడు.

ఎప్పుడూ ఒకే రకంగా ఈల వేస్తుంటాడు. అది వినబుద్ధికాదు అతనికి తప్ప...

"ఈ రోజు ఈల పాటలో ఏ పాట?" అని అడిగాను నేను.

"గుర్తు పట్టలేదా-'ఓల్డ్'మాన్ రివర్"

మళ్ళీసారి ఈల వేస్తున్నపుడు-"అంకుల్, మళ్ళీ అదే పాటేనా?" అని అడిగితే-

"కాదురా, ఇవి డాన్నీ బోయ్. తేడా తెలీడం లేదా" అని మళ్ళీ ఈల మొదలెట్టేవాడు.

ఒక్కోసారి అమ్మమ్మ చిరాకు పడేది.

"కెన్, ఎందుకురా అస్తమానం అలా ఈల వేస్తుంటావు. చిరాకుగా వుంటుంది. పోనీ ఈలవేయడం కంటే, సరదాగా పాడుకోవచ్చు కదా" అనేది.

"ఈ పాట ది బ్లూ డానుబే. దీంట్లో అంతా సంగీతమే. సాహిత్యం లేదు. పాడడానికి రాదు" అని వంటిల్లంతా ఈల వేసుకుంటూ డాన్సు చేస్తూ తిరిగే వాడు.

"నీ ఇష్టం. కానీ నీ ఈలా, డాన్సూ అంతా వండాలో చేసుకో. వంటింట్లో అయితే నా వంటంతా చెడిపోతుంది" అని విసుక్కుంది.

ఒకసారి కెన్ మామయ్యకు పంటి నొప్పి వస్తే డాక్టరు అతని పుచ్చిపోయిన పన్నొకటి తీసేసాడు. ఇక మామయ్య ఈల వేయలేడు అనుకున్నాం మేమంతా. కానీ ఇంకా బిగ్గరగా, ఘోరంగా ఈల వేయడం మొదలు పెట్టాడు.

ఒకరోజు మామయ్య జేబులో చేతులు పెట్టుకుని ఈల వేసుకుంటూ వీధిలో నడుస్తూ ఉంటే అటే సైకిలు మీద వెళ్తున్న అమ్మాయి, వున్నట్టుండి

సైకిలు ఆపి, ఎదురుగా నిలబడింది.

"కెన్నెల్ బాండ్, నేను ఇటు వెళ్తున్నప్పుడల్లా ఈల వేస్తే, మా అన్నయ్యను తీసుకొచ్చి ముక్కెలిరగ తన్నిస్తాను" అని బెదిరించింది.

కెన్ మామయ్య మొహం ఎర్రగా కందిపోయింది. నేనేమీ నిన్ను చూసి ఈల వెయ్యలేదు అన్నాడు.

"అలాగా? కానీ ఈ రోడ్డు మీద ఇంకెవరూ లేరుగా!"

"నేను 'గాడ్ సేవ్ ది కింగ్' ఈలలో పాడుకుంటున్నాను. నీకు తెలీలేదా?"



# కెన్ మామయ్య ఉద్యోగ పర్వం

"అంకుల్ కెన్ గురించి ఏమన్నా చేయాలి" అంది ఒక రోజు అమ్మమ్మ యథాలాపంగా, ఎవర్నీ ఉద్దేశించి కాకుండా.

నేనప్పుడు వంటింట్లోనే వున్నాను. బఠాణీలు వలుస్తూ, ఒకటి అరా నోట్లో వేసుకుంటూ. సయామిస్ పిల్లి 'సూజీ' అక్కడే పక్కనున్న షెల్ఫ్ మీద కూర్చుని అమ్మమ్మ చేసే 'వెరిష్ స్ట్యూ' వంక ఆశగా చూస్తోంది. దానికి వెరిష్ స్ట్యూ అంటే చాలా యిష్టం.

"అతను ఇంట్లో ఉండటం వలన నాకేమీ ఇబ్బంది లేదు. అతనేదో సంపాదించి నాకు పెట్టాలనీ కాదు. కానీ కుర్రాళ్ళు ఇలా పనీ పాటా లేకుండా చాలకాలం ఉండటం ఆరోగ్యకరం కాదు."

"అమ్మమ్మా, మామయ్య కుర్రాడా?"

"అతనికి నలభై ఏళ్ళు! అందరూ అంటారు-కాలక్రమేణా పెరిగేకొద్దీ బాగుపడతాడని."

"అతను మెబెల్ ఆంటీ దగ్గరకెళ్ళి ఉండొచ్చు కదా!"

"మెబెల్, ఆంటీ దగ్గర కెళ్తూనే ఉంటాడు. ఎమిలీ, బెరిల్ ఆంటీల దగ్గరకూడా వెళ్ళి ఉంటూంటాడు. అతని అదృష్టమేమంటే-అతనంటే ప్రాణం పెట్టే అక్కయ్యలున్నారు...వాళ్ళ భర్తలందరూ బాగా సంపాదిస్తున్నారు. అందరి దగ్గరా మూడేసి నెలలు, నా దగ్గర కొన్నాళ్ళూ గడిపేసి సంవత్సరం పొడవునా కాలం వెళ్ళదీసేస్తున్నాడు. అందుకనే అతనికి

ఉద్యోగం చేయాలనిపించటం లేదు."

"అది కూడా అదృష్టమే కదా," అన్నానేను.

"ఈ అదృష్టం ఎల్లకాలం వుండదు. మెబెల్ న్యూజిలాండ్ వన్నహాలు చేసుకుంటోంది. ఇండియాకు స్వతంత్రం వస్తే- ఇంకో ఏడాదికో రెండేళ్ళకో వస్తుంది-రాగానే ఎమిలీ,బెరిల్ కూడా ఇంగ్లాడు వెళ్ళిపోవచ్చు. ఎందుకంటే వాళ్ళ భర్తలు మిలటరీలో పని చేసే బ్రిటిష్ ఆఫీసర్లు."

"అంకుల్ కెన్ కూడా వాళ్ళతో ఇంగ్గండు వెళ్ళొచ్చుకదా?"

"అక్కడికి వెళ్ళినా వెంటనే ఉద్యోగం ప్రారంభించాలని అతనికీ తెలుసు. అక్కడ అందరూ ఎవరి పనులు వాళ్ళు చేసుకుంటారు. అప్పుడు మీ అంటేలు ఇతన్ని చాలా కాలం భరించలేరు. అయినా, ఇంగ్లండు లేదా న్యూజిలాండ్ వెళ్ళడానికి వీడికి ఛార్జీ డబ్బులు ఎవరిస్తారు."

"పోనీ వెళ్ళలేకపోతే, ఇక్కడే నీతో ఉండి పోతాడు. నీవయితే ఇక్కడే ఉంటావు కదా?"

"ఉంటాను. కానీ ఎల్లకాలం కాదుకదా? నేను బతికున్నంత వరకూ."

"నీవు ఇంగ్లండుకు వెళ్ళవా?"

"లేదురా, నేను వెళ్ళను. నేనిక్కడే పెరిగిన చెట్టులాటి దాన్ని. దాని వేళ్ళు ఇక్కడు ఉన్నాయి. నేనెక్కడికీ వెళ్ళను. నా జీవితం ఇక్కడే రాలిపోవాలి... పెద్దవాడైనాక నీవు వెళ్ళొచ్చు. బహుశా నీ పెద్ద చదువులు ఇంగ్గండులోనే చదువుతావేమో!"

"నేనిక్కడే చదువుకుంటాను అమ్మమ్మా. నా సెలవులన్నీ ఇక్కడే గడుపుతాను. నేను ఇంగ్లండు వెళ్ళిపోతే, నీవు ముసలిదానివై పోయాక నిన్నెవరు చూసుకుంటారు?"

"నేనప్పుడే ముసలిదాన్నయి పోయానురా! నాకు అరవై ఏళ్ళు."

"అరవై ఏళ్ళంటే ముసలిదానివయి పాయినట్టేనా? అంకుల్ కంటే కొంచెం పెద్దదానివి. నీవింకా ముసలిదానివయిపోతే కెన్ మామయ్యని ఎవరు చూస్తారు?""

"ఎవరు చూసుకుంటారు? అతనే ఏదో ఉద్యోగం చూసుకుని తనను

తానే చూసుకోవాలి."

నేను ఈ సమస్య గురించి ఆలోచించాను. కెన్ మామయ్యకు ఉద్యోగం ఎవరిస్తారు? అతనే ఉద్యోగానికి సరిపోక పోవచ్చు. అంతలో ఆయా ఒక సలహా యిచ్చింది.

"గుల్షన్ మహారాణి వాళ్ళ పిల్లలకు పాఠాలు చెప్పే మాస్టారు కోసం చూస్తున్నారు. ఒకబ్బాయి, ఒకమ్మాయి మాత్రమే!" అని చెప్పింది.

"నీకెలా తెలుసు?" అని అడిగింది అమ్మమ్మ.

"వాళ్ళ పిల్లల్ని చూసుకునే ఆయా చెప్పింది. తనకి రెండు గంటలు సేపు పిల్లల్ని చూసుకుంటే రెండువందల రూపాయలు జీతం యిస్తున్నారని."

"కెన్ మామయ్యకు ఈ ఉద్యోగం సరిపోవచ్చు," అన్నాన్నేను.

"నిజమే, ఇది మంచి ఆలోచనే, మామయ్యకు చెప్పి ఒప్పించి అప్లికేషను పెట్టించాలి. వెళ్ళి మహారాణిని కలవమని చెప్పాలి," అంది అమ్మమ్మ.

మహారాణిని కలిసి ఆ ఉద్యోగం తనకిమ్మని అడగడానికి కెన్ మామయ్య అంగీకరించాడు. కానీ అతను వెళ్ళినపుడు రాణి లేకపోవడం వలన, మహారాజా గారే అతన్ని ఇంటర్వ్యూ చేసారుట.

"నీకు టెన్నిస్ ఆడటం వచ్చా?" అడిగాడట మహారాజా.

"వచ్చు" అన్నాడు కెన్ మామయ్య తనెప్పుడో స్కూల్లో ఆడిన టెన్నిస్ ఆటను దృష్టిలో ఉంచుకుని.

"అలాగయితే ఈ ఉద్యోగం నీదే. నేనెప్పట్నుంచో టెన్నిస్ డబుల్స్‌లో నాలుగో చెయ్యి కోసం చూస్తున్నాను...మీరు కేంబ్రిడ్జిలో చదువుకున్నారా?"

"లేదు. ఆక్స్‌ఫర్డ్‌లో," అన్నాడు కెన్.

మహారాజా గారు మహా సంతోషించారు. వారు సరిగ్గా అలాటి వ్యక్తి కోసమే, ఆక్స్‌ఫర్డ్‌లో చదువుకుని, తనతో టెన్నిస్ ఆడగలిగిన వ్యక్తినే పిల్లలకు ట్యూషన్ మాస్టర్‌గా నియమించాలని, చూస్తున్నారు.

ఇంటర్వ్యూ గురించి అమ్మమ్మతో చెప్తుంటే, అమ్మమ్మ-"నీవు ఆక్స్‌ఫర్డ్‌లో ఎప్పుడున్నావు? అలా ఎందుకు చెప్పావు?" అని అడిగింది.

"అదేమిటే అలా అంటున్నావు. నేను మీ తమ్ముడు జిమ్ దగ్గర

ఆక్స్‌ఫర్డ్‌లో రెండేళ్ళు ఉన్నాను కదా?"

"అవును కానీ, నీవక్కడ యూనివర్సిటీలో చదువుకోలేదు కదా? అక్కడలను నడిపే 'పబ్' లో అతనికి సాయంగా వుండేవాడివి."

"నిజమే. కానీ మహారాజా గారు నీవక్కడ ఆక్స్‌ఫర్డ్ యూనివర్సిటీలో చదువుకున్నావా అని అడగలేదే? కేంబ్రిడ్జ్‌లో ఉన్నావా అంటే లేదు ఆక్స్‌ఫర్డ్‌లో ఉండేవాణ్ణని చెప్పాను. అది నిజమే కదా! మహారాజా నీవక్కడ ఏం చేస్తుండేవాడివని అడగలేదు. నే చెప్పలేదు. అయినా దీంట్లో ఏముందీ?" అని తేలిగ్గా కొట్టి పారేసి, ఈలవేసుకుంటూ బయటికి వెళ్ళి పోయాడు.

*   *   *

కెన్ మామయ్య ఆ ఉద్యోగంలో చక్కగా యిమిడి పోవటం చూసి మా అందరికీ ఎంతో ఆశ్చర్యం వేసింది. ఎలాగయినా కొత్త ఉద్యోగం కదా?

మహారాజా గారికి టెన్నిస్ ఆట సరిగ్గా వచ్చేది కాదు. తనంత కూడా ఆట తెలియని కెన్ మామయ్యను చూసి ఆయన చాలా సంతోషించాడు. తన జతగా ఆడే మనిషిగా కాకుండా, తన ప్రత్యర్థిగానే ఆడనిచ్చేవాడు. మహారాజాగారిని గెలిపించినంత కాలం, మామయ్య ఉద్యోగానికి ఢోకా లేదు

టెన్నిస్ ఆటలు మధ్యా, బాతుల వేటకు (డక్ షూటింగ్స్) వెళ్ళినపుడూ అప్పుడప్పుడు పిల్లలకు పాఠాలు చెప్తుండే వాడు. చదవడం, రాయడం, లెక్కలు చేయించడం వంటివి చెప్పేవాడు. కొన్నిసార్లు నన్ను కూడా వెంటబెట్టుకుని వెళ్ళేవాడు. తను చెప్పే లెక్కలు సరిగ్గా ఉన్నాయో లేదో చూట్టానికి. మామయ్యకు తీసివేత సరిగ్గా వచ్చేది కాదు.

మహారాజా గారి పిల్లలు నా కంటే చిన్న ఈడు వాళ్ళు. ఒక్కోసారి మామయ్య వాళ్ళను నా అజమాయిషీలో వదిలేసి-"రస్టీ, వాళ్ళు లెక్కలు సరిగ్గా చేస్తున్నారా లేదా కొంచెం కనిపెట్టు చూస్తుండు" అని చెప్పి, జేబుల్లో చేతులు పెట్టుకుని, ఈల వేసుకుంటూ టెన్నిస్ కోర్టు వైపు వెళ్ళి పోయేవాడు.

ఇద్దరు పిల్లల్లో ఒకే లెక్కకు విడివిడిగా రెండు ఆన్సర్లు వచ్చినా ఇద్దర్నీ మెచ్చుకునేవాడు. "గుడ్, ఎక్సలెంట్. మీరిద్దరూ కష్టపడి చదువుకుంటున్నారు. మీ ఇద్దర్లో ఒకరిది తప్పు, ఒకరిది రైటు అయ్యుండాలి. కానీ నేనెవ్వర్నీ నిరుత్సాహ

పరచదలుచుకోలేదు," అనేవాడు.

ఇంటికొచ్చాక, "రష్టీ, వాళ్ళిద్దర్లో ఎవరి లెక్క రైటురా?" అని అడిగేవాడు.

"ఇద్దరిదీ తప్పు, కెన్ మామయ్యా."

*　　　　*　　　　*

మహారాజా గారిని టెన్నిస్ లో ఓడించినందుకే తన ఉద్యోగం ఊడిందని కెన్ మామయ్య వాదించేవాడు.

మామయ్యకు ఆటలో ఎలాగైనా గెలవాలన్న పంతమేమీ వుండేది కాదు... కానీ అప్పుడప్పుడూ మహారాజా గారి కోసం వచ్చే అతిథులతో, వారి సెక్రటరీలతో ఆడటం వలన మామయ్య టెన్నిస్ ఆట బాగా ఆడుతున్నాడు యిప్పుడు.అందువలన ఒకసారి రాజాతో ఓడిపోవాలని ఎంత ప్రయత్నించినా, తన యజమానిపై గెలవవలసిన పరిస్థితిఏర్పడింది

మహారాజా గారికి మహాకోపం వచ్చేసింది.

"మిస్టర్ బాండ్, మీకు ఓటమి లోని గొప్పతనం తెలిసినట్టు లేదు. అందరం గెలవలేమని మీకు తెలుసు. ఓటమి లేని ప్రపంచం ఎలా వుంటుందో ఒక్కసారి ఊహించండి" అన్నారు ఉద్రేకంతో.

"మన్నించండి మహారాజా, అనుకోకుండా జరిగి పోయింది," అన్నాడు కెన్ మామయ్య.

మహారాజా గారు కెన్ మామయ్యను మన్నించారు. కానీ మళ్ళీ ఒక వారం తరువాత అలాగే జరిగింది. కెన్ అంకుల్ మళ్ళీ గెలిచాడు. ఈసారి మహారాజా గారు ఒక్కమాట కూడా మాట్లాడకుండా టెన్నిస్ వదిలి వెళ్ళిపోయారు.

మరునటి రోజు మామయ్య పిల్లలకు పాఠాలు చెప్పే సమయానికి మహారాజా గారు వచ్చారు. కెన్ మామయ్య పిల్లలతో గీతలు గీసుకుని పులీ, మేకా ఆడుతున్నాడు.

"రేపట్నుంచీ మీరు రానక్కరలేదు, మిస్టర్ బాండ్. ఒక నెల నోటీసుకు బదులుగా, ఒక నెల జీతం ఇవ్వమని మా సెక్రటరీతో చెప్పాను."

కెన్ అంకుల్ జేబులో చేతులు పెట్టుకుని, సరదాగా ఈల వేసుకుంటూ ఇంటికి వచ్చి చేరాడు.

"ఇంత త్వరగా వచ్చేసావే?" అని అడిగింది అమ్మమ్మ.

"ఇప్పట్నుంచీ వాళ్ళు నన్ను రావద్దన్నారు."

"అలాగా! పోనీలే...లోపలికి వచ్చి టీ తాగు."

అమ్మమ్మకు తెలును- మామయ్య ఏ ఉద్యోగం లోనూ నిలకడగా ఉండలేడని. అయినా అమ్మమ్మది ఎవర్నీ సతాయించే స్వభావం కాదు. ఆ తరువాతెప్పుడో అంది: "పోనీలే, ప్రయత్నమైనా చేసాడు. వేరే ఉద్యోగాల్లో కంటె ఎక్కువ రోజులు పని చేసాడు-రెండునెలలు!"



# కెన్ మామయ్య కారు నడపడం

ఆ తరువాత నేను డెహరా కెళ్ళినప్పుడు, స్టేషనుకు మోహన్ వచ్చాడు. మేమిద్దరం కలిసి, ఒక టాంగా మాట్లాడుకుని, దాంట్లో సామానులన్నీ సర్ది అది నరదాగా అటూ ఇటూ వూగుతుంటే అమ్మమ్మ ఇంటికి బయలు దేరాము.

"మోహన్, ఏవిటి విశేషాలు?"

"పెద్ద విశేషాలేం లేవు. కొంతమంది దొరలు ఇళ్ళమ్మేనుకుని తిరిగి వెళ్ళిపోతున్నారు. సూజీ మళ్ళీ పిల్లల్ని పెట్టింది."

నేను రెండు రోజుల ప్రయాణం తరువాత ఇల్లు చేరుకుంటున్నానని అమ్మమ్మకు తెలుసు. నా కోసం చక్కటి బ్రేక్‌ఫాస్ట్ తయారు చేసి పెట్టింది. పారిడ్జ్, కాల్చిన ఆమ్లెట్, టొమేటాలో ఫ్రై చేసిన పంది మాంసము. బ్రెడ్ టోస్ట్, మార్మలేడ్‌తో పాటు చిక్కటి పాలతో కాచిన కమ్మని టీ.

టిఫిన్ చేస్తూంటే, మామయ్య దగ్గర నుండి ఉత్తరం వచ్చిన సంగతి చెప్పింది.

"మామయ్య సిమ్లాలోని ఫిర్పో హోటల్ లో అసిస్టెంట్ మేనేజర్ పద్ద నుండి ఉత్తరం వచ్చింది. ఉండటానికి ఇల్లూ, భోజనమూ అన్నీ ఫ్రీగా ఇస్తారు. మంచి జీతం. ఈసారయినా నిలకడగా ఉంటే బాగుంటుంది" అని.

మూడు రోజుల తరువాత కెన్ మామయ్య తన పరుపు చుట్టలోనూ, పాత సూట్‌కేసులోనూ వరండాలో ప్రత్యక్షమయ్యాడు.

"అదేమిటీ, హోటల్ ఉద్యోగం మానేసావా?" అని అడిగింది అమ్మమ్మ.

"లేదే. వాళ్ళే హోటలు మూసేసారు."

"మూసేసారా? నీ కారణం వల్ల కాదు కదా?"

"లేదు! యేమో ఆంటీ! హిల్ స్టేషన్స్ లోని పెద్దపెద్ద హోటళ్ళను అన్నింటినీ మూసేస్తున్నారు."

"పోనీలే. లోపలకొచ్చి టిఫిన్ చెయ్యి. ఈ రోజు కోఫ్తా కూరా చేసాను రస్టీ కిష్టమని."

"ఓ, రస్టీ ఇక్కడే ఉన్నాడా? నాకెంతోమంది మేనల్లుళ్ళు, మేనకోడళ్ళు ఉన్నా, నాకు రస్టీ అంటేనే ఇష్టం. మేబెల్ పిల్లలిద్దరూ నేను సిమ్లాలో ఉండగా, నాప్రాణం తినేసారనుకో!"

భోంచేస్తున్నప్పుడు కెన్ అంకుల్ జీవనోపాధి గురించి చాలా సీరియస్‌గా మాట్లాడేడు. ఎలాగైనా, ఏదైనా ఉద్యోగం సంపాదించాలని పట్టుదలగా ఉన్నట్లు కనిపించాడు.

"డెహరాడూన్ నగరానికంతా ఒకే ఒక టాక్సీ వుంది కదా? మరో టాక్సీ పెడితే బాగా నడుస్తుందేమో!" అన్నాడు మెల్లగా.

"నడపవచ్చు. కానీ అది నీకెలా వుపయోగపడుతుంది? నీ దగ్గర టాక్సీ లేదు. నీకు నడపడం కూడా రాదు."

"నేర్చుకోవడం ఎంతసేపు? పక్కనే ఒక డ్రైవింగ్ స్కూలు వుంది. పైగా గారేజిలో మామయ్య పాతకారు కూడా వుంది. ఊరికే దుమ్ము కొట్టుకుని పోతోంది." (అతను చెప్పేది తాత గారి 1925 మోడల్ హిల్‌మన్ రాడ్‌స్టర్ గురించి. ఇరవై ఏళ్ళ క్రితం మోడలు.)

"అదిప్పుడు పనికిరాదురా!"

"శుభ్రంగా పనికొస్తుంది. దానికొంచెం రంగుపూసి, అక్కడక్కడా నూనె, గ్రీస్ వేస్తే సరి."

"అలాగయితే సరే. ముందు డ్రైవింగ్ నేర్చుకో చూద్దాం."

సరే, అంకుల్ కెన్ డ్రైవింగ్ స్కూల్లో చేరాడు.

ఒక్కరోజూ కూడా ఎగ్గొట్టకుండా, రోజూ గంటసేపు వెళ్ళేవాడు. దీనికి

అమ్మమ్మ ఫీజు కట్టింది. ఒక నెల తరువాత తనకు డ్రైవింగు బాగా వచ్చేసిందనీ రోడ్‌స్టర్‌ని ఒకసారి ట్రైయల్ వేయడానికి బయటకు తీస్తానని అన్నాడు.

“కానీ, నీకింకా లైసెన్సు రాలేదు కదా?” అంది అమ్మమ్మ.

“నేనెక్కువ దూరం వెళ్ళను. ఊరికే ఈ వీధి చివర దాకా తీసికెళ్ళి వెనక్కి తెచ్చేస్తాను.”

ఆ రోజు ఉదయం నుండి కారుని శుభ్రంగా కడిగి, తుడిచాడు.దానికి పెట్రోలు పోయించడానికి అమ్మమ్మ డబ్బిచ్చింది.

సాయంత్రం టీ తాగాక “రస్టీ , బయలుదేరు, కార్లో అలా వెళ్ళొద్దాం. నీ ఫ్రెండ్ మోహన్‌ని కూడా తీసుకురా అన్నాడు” కెన్ మామయ్య.

మా ఇద్దరికీ కొంచెం భయమేసింది. “ఒద్దులే మామయ్యా, మరోసారి వస్తాంలే” అని చెప్పి తప్పించుకున్నాను.

“జాగ్రత్త. మరీ స్పీడుగా వెళ్ళకు. నీకు ఈ కారు ఇంకా అలవాటు కాలేదు కదా?” అని హెచ్చరించింది అమ్మమ్మ.

అలాగే నన్నట్టుగా తలూపి, చిరునవ్వు నవ్వుతూ కారెక్కి రెండుసార్లు హారను మ్రోగించాడు. సాయంకాలం వ్యాహాళికని బయలుదేరిన మిస్. కెల్‌నర్ కార్లో మామయ్యను చూసి లోపలికెళ్ళి తలుపు వేసేసుకుంది.

కెన్ అంకుల్ నేరుగా, హారను మోగించుకుంటూ జోరుగా డ్రైవ్ చేసుకుంటూ ముందుకెళ్ళాడు. ఆ వీధి చివర్లో ఒక మలుపు ఉంది.

నేనిక్కడ తిప్పుకుని, వెనక్కి వెళ్ళిపోతాను అనుకుంటూ స్టీరింగ్ చక్రాన్ని తిప్పాడు. కానీ స్టీరింగు సరిగ్గా తిరగలేదు. పక్కకు తిరక్కుండా నేరుగా వెళ్ళి, వెళ్ళి గుల్షన్ మహారాజా గారి తోటకు కంచెగా కట్టుకున్న ప్రహారీ గోడకు తగిలింది. కారుకు గానీ, మామయ్య కు గానీ ఏమీ దెబ్బలు తగల్లేదు. గోడను పడగొట్టి తోట మధ్యలోకెళ్ళి ఆగింది.

అక్కడ మహారాజా గారు తన సెక్రటరీలతో, వారి అసిస్టెంట్‌లతో మాట్లాడుతున్నారు. తన ఎదురుగా కారులో, డ్రైవింగ్ వీల్ వెనుక మామయ్యను చూసి-“రావోయ్ పాత మిత్రమా, రా. నీవు రావడం చాలా సంతోషమైంది. ఒక ఆట టెన్నిస్ ఆడదామా?” అని అడిగారు రాజాగారు.

# వికెట్ల వెనక కెన్ మామయ్య

మహారాజా గారిని మళ్ళీ మంచి చేసుకున్నా కెన్ మామయ్యకు ఏమీ ఉద్యోగం దొరకలేదు.

అమ్మమ్మ మళ్ళీ అతన్ని కారు బయటకి తియ్యనీయ లేదు. మొదట్లో కొద్దిగా గునిసాడు. తాతయ్య బతికున్న రోజుల్లో స్టీరింగ్ వీల్‌ను సరిగ్గా రిపేరు చేయించలేదని పదేళ్ళ క్రితం చనిపోయిన తాతగారి పైన కోపం తెచ్చుకున్నాడు. రెండు రోజులు భోంచేయకుండా పస్తులున్నాడు. (టిఫిన్ కి భోజనానికి మధ్య) ఈల వేయడం మానేసాడు చాలా రోజులు దాకా.

పోన్లే ఇదీ మన మంచికే అనుకుంది అమ్మమ్మ.

ఉన్నట్టుండి ఎమిలీ ఆంటీ దగ్గరకు లక్నో వెళ్తాను అన్నాడు.

"ఆమెకి స్కూలు కెళ్ళే పిల్లలు, ముగ్గురితో చేతినిండా పని. ఎక్కువ రోజులు వుండకు" అంది అమ్మమ్మ.

"నేనెన్ని రోజులున్నా ఆమెకేమీ అభ్యంతరం ఉండదులే" అన్నాడు కోపంగా.

కెన్ మామయ్య లక్నో వెళ్ళడం గొప్ప విశేషంగా పరిణమించిందని మాకు తరువాత తెలిసింది.

మామయ్య లక్నో స్టేషన్లో దిగగానే చాలామంది అతన్ని చుట్టుముట్టారుట. అందరూ చేతులూపుతూ హిందీ, ఉర్దూ, మరియు ఇంగ్లీషు భాషల్లో ఏదో

అంటున్నారు. అతనికేమవుతుందో అర్థమయ్యే లోపలే వాళ్ళు అతన్ని బంతిపూల మాలల్తో ముంచెత్తారు. వాళ్ళలో ఒక యువకుడు ముందుకు వచ్చి"గోమతీ క్రికెట్ అసోసియేషన్ వాళ్ళు చారిత్రాత్మకమైన ఈ లక్నో నగరానికి మిమ్మల్ని సాదరంగా ఆహ్వానిస్తున్నారు" అని, మామయ్యను స్టేషను బయటవున్న కారులో ఎక్కించారు.

అతనెక్కిన కారు స్టేడియం దగ్గరకెళ్ళి ఆగేదాకా, వాళ్ళు అతనిని క్రికెట్ ఆడటానికి తీసుకొచ్చారని మామయ్యకు తెలియలేదు.

అసలు ఏమైందంటే:

బ్రూస్‌హాలమ్ అనే ఒక ప్రఖ్యాత ఇంగ్లీషు క్రికెట్ ఆటగాడు ఇండియాకు వచ్చాడు. లక్నోలో ఒక 'ఛారిటీ షో' ఇవ్వడానికి అంగీకరించాడు. కానీ ఆ క్రితం రోజు అతనికి ఉన్నట్టుండి కడుపునొప్పి రావడం వలన, రైలు అందుకోలేక పోయాడు. ఆ విషయం లక్నో వాళ్ళకి టెలిగ్రాము ద్వారా తెలియపరచాడు. కానీ చాలా టెలిగ్రాములకి మల్లే వాళ్ళకి అది అందలేదు. లక్నో లోని క్రికెట్ అభిమానులంతా గొప్ప క్రికెటర్ బ్రూస్‌హాలమ్‌ని ఆహ్వానించడానికి స్టేషను కొచ్చారు. కాకతాళీయంగా, మామయ్య చూడ్డానికి నిజంగా బ్రూస్‌హాలమ్ లాగే ఉన్నాడుట. రంగు, కొద్దిగా బట్టతల అన్నీ అతని లాగే అనిపించాయిట. అందుకని ఆ తికమక. కెన్ మామయ్యకు ఇలాంటి తికమకలంటే సరదా.

గోమతి క్రికెట్ అసోసియేషన్ వారి ఆతిథ్యం తీసుకుని, భోజనమూ అవీ చేసాక ఆడకపోతే బాగుండదని, మామయ్య క్రికెట్ ఆడటానికి నిర్ధారించాడు. నాకు టెన్నిస్ వచ్చు కదా? టెన్నిస్ బాల్‌ని కొట్టాక క్రికెట్, బాల్‌ని కొట్టకపోతానా అని తనకు తానే సర్ది చెప్పుకుని, బ్లేజర్ తొడుక్కుని రంగంలోకి దిగాడు.

* * *

గోమతీ టీమ్ వాళ్ళు టాస్ గెలిచి బాటింగ్ చేయాలని నిశ్చయించుకున్నారు. కెన్ మామయ్య మూడవ బాట్స్‌మన్‌గా వెళ్ళవలసి వుంది అంటే బ్రూస్‌హాలమ్ స్థానంలో అన్నమాట. కానీ అందరికంటే ముందు తనే వికెట్ల దగ్గరకు నడిచాడు. పైగా ఎవరూ ఎందుకు ముందుకు రావడం లేదో కూడా

అతనికి తెలీలేదు.

అతను అందుకున్న మొదటి బాల్ షార్ట్ పిచ్‌లో వేసారు. దాన్ని టెన్నిస్ బాల్‌ని కొట్టినట్టుగా పైకెత్తి మిడ్‌వికెట్ బౌండ్రీ కి కొట్టాడు. జనం అంతా గట్టిగా చప్పట్లు కొట్టారు. ఆ తరువాత బాల్ అతని పాడ్స్‌కి వచ్చి తగిలింది. కానీ అతన్ని 'ఔట్' అని చెప్పడానికి అంపైర్ సందేహించాడు. వందలాది డబ్బు పెట్టి టికెట్లు కొనుక్కుని ఆట చూడ్డానికి వస్తే బ్రూస్‌హామ్‌ను అప్పుడే ఔట్ చేయడం సమంజసం కాదనిపించింది.

'నాట్‌ఔట్' అన్నాడు అంపైర్.

మూడవ బాల్ కెన్ అంకుల్ బాట్ చివర కొసకు తగిలి స్లిప్స్ గుండా దూసుకుపోయింది.

"లవ్‌లీ షాట్" పెవిలియన్ లో కూర్చున్న ఒక పెద్ద మనిషి ఆనందంతో అరిచాడు.

"ఎ క్లాసిక్ లేట్‌కట్" అన్నారు మరెవరో.

బాల్ బౌండ్రీకి వెళ్ళి తగిలింది. అంకుల్ పేరు మీద మరో నాలుగు రన్‌లు జమ అయ్యాయి. దాంతో ఆ 'ఓవర్' అయిపోయింది. అతని పార్ట్‌నర్ వంతు వచ్చింది. అతను బాల్‌ను కొట్టి ఒక రన్ తీసుకొని, మరో రన్ కోసం పరిగెత్తమని మామయ్యతో అన్నాడు, ఎందుకు హైరానా ? ఒక రన్ చాలాదా అనుకుంటూనే పరుగెత్తబోయి, సగంలో ఉండగానే ఫీల్డర్ బాల్‌ను వికెట్ కేసి కొట్టాడు. కెన్ మామయ్య ఈసారి నిర్ధారణంగా ఔటు అయ్యాడు.

ప్రేక్షకులంతా సానుభూతితో చప్పట్లు కొడుతుంటే పెవిలియన్ వైపు నడిచాడు మామయ్య.

"అతన్దేం తప్పుకాదు. అవతలి బాట్స్‌మన్‌దే. మరో రన్ రావడానికి అవకాశం లేనప్పుడు పరుగెత్తమని ఎందుకు చెప్పాలి? అయినా కాన్పూర్ నుండి ఇంత దూరం ఆ ఒక్క సూపర్బ్ లేట్ కట్ చూడ్డానికీ రావచ్చు" అన్నాడు ఆ పెద్ద మనిషి.

# మొంబసా వెళ్ళడానికి ఎత్తులు

స్కూలు బిల్డింగు పైన ఉన్న పెద్ద గడియారం పదకొండు గంటలు కొట్టింది. నేను మంచం మీద నుండి మెల్లగా లేచి, జిమ్ బూట్స్ వేసుకుని, చప్పుడు చేయకుండా డార్‌మెటరీ నుండి బయట పడ్డాను.

తలుపు దగ్గర ఒక నిమిషం ఆగి, గదిలోకి తొంగి చూసాను. చీకటిగా వుంది. ఇంకా ఎవరూ లేవలేదని నిర్ధరించుకుని, కారిడార్‌లోంచి త్వరత్వరగా మెట్లు దిగాను. అప్పటికే దల్‌జిత్ వరండాలో ఉన్నాడు. అతను సిక్కుజాతి వాడు. తలకు చుట్టుకున్న తలగుడ్డ తీసేసి పొడవాటి జుట్టును పైకి తీసి ముడి పెట్టాడు. అతను తొడుక్కున్న తెల్లటి పైజామా చీకట్లో కొట్టొచ్చినట్టుగా కనపడుతుంది. చుట్టుపక్కల టీచర్లెవరైనా వుంటే, మమ్మల్ని తప్పక గుర్తు పట్టేవాళ్ళు.

నన్ను చూడగానే పెదవుల మీద చూపుడు వేలు నొక్కిపెట్టి మాట్లాడవద్దన్నట్టుగా సంజ్ఞ చేసాడు. ఇలాటివి నాకు నేర్పక్కర్లేదు. నేను జాగ్రత్తగానే ఉంటాను. కానీ దల్‌జిత్ చాలా హుషారుగా కథనంతా ఒక మిస్టరీలాగా నడపాలనుకున్నాడు.

మునివేళ్ళ మీద నడవడం దల్‌జిత్‌కు అలవాటు లేదు. అతని పాదాలు మామూలు సైజు కంటె పెద్దవిగా ఉంటాయి. పంజాబీ భాషలో ఒక సామెత వుంది. పెద్దపాదాల వాళ్ళు కాయ కష్టానికే పనికొస్తారివి. కానీ దల్‌జిత్ ఈ విషయం ఒప్పుకునే వాడు కాదు. పెద్ద పాదాల వాళ్ళకి ప్రయాణ యోగం

ఎక్కువగా ఉంటుందని వాదించేవాడు. ఇప్పుడు దాన్ని నిజం చేయబోతున్నాడు.

మేము మెల్లగా నిశ్శబ్దంగా పెవిలియన్ ముందు భాగం దాటి బయటకొచ్చాము. రాబోయే భారీ వర్షానికి సూచనగా, దట్టంగా మేఘాలు ముసురుకొన్నున్నాయి. పెవిలియన్ మెట్లు పరిగెత్తుకుంటూ దిగి జిమ్ నేషియంలోకి వచ్చి పడ్డాము. జిమ్ గది తలుపు ఎప్పుడూ తెరిచే వుంటుంది. ఆ గదిలో తేమ వాసనా, కాయర్ తివాచీ వాసనా, వార్నిష్ వాసనా, చెమట వాసనా అన్నీ కలిపిన ఒక గమ్మత్తయిన వాసన నిండి వుంటుంది. అదే మేం రాత్రిళ్ళు కలుసుకుని మంతనాలు జరుపుకునే గది.

ఆ రోజు మేము స్కూలు నుండి పారిపోవాలని తీసుకున్న పథకానికి చివరి మీటింగ్.

చిన్న కొవ్వొత్తి ముక్కను వెలిగించి, టేబిల్ మీద పెట్టి, "మీరంతా తయారుగా వున్నారా?" అని అడిగాడు. అందరూ బాసింపట్లు వేసుకుని ఒకరికెదురుగా ఒకరు కూర్చున్నాము. కొవొత్తి వెలుగు దల్‌జిత్ మొహం మీద పడ్తోంది. అతని మొహంలో మంచితనం కొట్టొచ్చినట్టు కనిపిస్తుంది. నేను నీడలోనే, వెలుగు పడని చోట ఉండి పోయాను.

"అన్నీ తయారుగా ఉన్నాయి. చాకు, రెండు బిస్కెట్ పాకెట్లు, బ్రెడ్, ఒక చేపల డబ్బా, కొన్ని తీపిపదార్థాలు..." అన్నాను నేను.

క్రిందటి వారం భోజనాల సమయంలో దొంగతనంగా దాచేసిన బ్రెడ్ అప్పటికే గట్టిపడి, ముగ్గు వాసన వేస్తోంది. కానీ నేను చాలా సామానులు పోగు చేసాను అని చెప్పాలని దాన్ని కూడా పట్టీలో చేర్చాను.

"ఇవి సరిపోకపోవచ్చు. డబ్బెంత ఉంది?" అడిగాడు దల్‌జిత్.

"ఆరు రూపాయలు. రెండు నెలల పాకెట్ మనీ."

"ఫరవాలేదు రస్టీ" అన్నాడు దల్‌జిత్. నాకెక్కువ పాకెట్ మనీ రాదని దల్‌జిత్‌కి తెలుసు. "నా దగ్గర సుమారు ముప్ఫై రూపాయలున్నాయి ప్రస్తుతానికి. అందుకని డబ్బు గురించి కూడా మనం ఎక్కువగా ఆలోచించనక్కర్లేదు. నాదగ్గరింకా జున్నుగడ్డ, జామ్, చాక్లెట్లు , పచ్చడి, మావాళ్ళు పంపించినవి ఇంకా మిగిలి వున్నాయి."

"పచ్చడితో చాక్లెట్లా?"

"అలాకాదోయ్. అన్ని వరకులలో బాటు ఇవీ అన్నమాట. దార్లో తినడానికి కావాలి కదా?" అన్నాడు.

దల్ జిత్‌కు తినుబండారాలు పార్స్‌ల్స్ తరచూ వచ్చేవి. వాళ్ళ నాన్న గారికి తూర్పు ఆఫ్రికా లో ఏదో వ్యాపారం. అందుకే దల్ జిత్‌కి చదువు మీద అంతగా శ్రద్ధ ఉండేది కాదు. అతని ఆలోచనెప్పుడూ ఆఫ్రికా కు ఎప్పుడు వెళ్ళిపోవాలా అని ఉండేవి. అతనికి ఇండియాలోని బోర్డింగ్ స్కూళ్ళంటే చిరాకు. అందువల్లే అతను మా జట్టు లో కలిసాడు. మా చిన్నాన ఒక చిన్న ఓడకు కెప్టన్ గా ఉండేవాడు. అది తూర్పు ఆఫ్రికాలోని మొంబసా దాకా వెళ్ళేది. ఒక్కోసారి మన దేశం లోని పశ్చిమ తీరంలోనే జామ్‌నగర్, ద్వారకా మొదలైన ఊళ్ళకు వెళ్ళేది. అతను కేప్టన్‌గా ఉన్న ఓడ పేరు. ఎస్. ఎస్. లూసీ. ఆ ఓడ ఈ నెలఖారుకి జామ్ నగర్‌కి వస్తుంది. ఎలాగయినా మా చిన్నాన ను బతిమాలి, ఒప్పించి. ఆ ఓడలో వెళ్ళాలని మా ప్రయత్నం.

దల్ జిత్‌కు ఆఫ్రికా వెళ్ళిపోవాలని వుంది. ఇండియానుండి ఒక్కడే అలా ఓడ ఎక్కి వచ్చేసాడని తెలిస్తే మళ్ళీ బోర్డింగు స్కూలుకి పంపరన్న ధైర్యం అతనికుంది.

నాకూ వెళ్ళి పోవాలని వుంది కానీ కారణాలు మాత్రం ఇవి కావు. స్కూలు నచ్చక పోవడం కూడా ఒక కారణమే. ఇది డికెన్స్ 'డోత్ బాయ్స్ హాల్' అంత అధ్వాన్నంగా లేకున్నా మంచి స్కూలు మాత్రం కాదు. మా ప్రిన్సిపాల్ దీన్ని స్కూలులాగా కాకుండా ఒక వ్యాపార సంస్థలాగా నడిపేవాడు. "తక్కువగా ఇచ్చి, ఎక్కువగా రాబట్టాలన్నది" అతని ఉద్దేశ్యం. పెద్ద మొత్తాల్లో ఫీజు వసూలు చేసి, పనికి రాని టీచర్లను పెట్టి, నాసిరకం భోజనాలతో పని జరిపించేవాడు. నిజానికి మా అభిప్రాయం సరి అవునో, కాదో గానీ, మాకు మాత్రం అలా అనిపించేది.

దల్ జిత్ అరుండేల్ స్కూల్లో (అదే మా స్కూలు పేరు) చేరడానికి అతనే కారణం. అతన్ని చేర్పించిన ఏ స్కూల్లోనూ దల్ జిత్ ఇమడక అన్ని స్కూళ్ళలోనూ ప్రయత్నించి ఆఖరుకు ఇక్కడ చేర్పించారు. ఇక్కడ

మూణ్ణెల్ల పాటు సెనగ చారు, కొవ్విన మాంసము తినీ, తినీ మొహం మొత్తి వెళ్ళిపోవాలని నిశ్చయించుకున్నాడు.

"నేనిక ఏ స్కూల్లోనూ చదవను. అతననే వాడు నైరోబీలో మానాన్న గారి బిజినెస్ చూసుకుంటూ వుండిపోతాను. నాకు చదవడం, రాయడం వచ్చు. లాభనష్టాల విషయం తెలుసు. అంతకంటే ఏం కావాలి? నీవేం చేస్తావు రస్టీ?"

"నేను రచయిత నౌతాను. నాకు స్కూలు కెళ్ళాలనే ఉంది. కానీ ఈ స్కూలు ఇష్టం లేదు. కానీ నా గార్డియన్ నన్ను వేరే స్కూల్లో చేర్పించక పోవచ్చు," అన్నాను.

మా అమ్మ నాన్నా చనిపోయారు. నా గార్డియన్ నన్ను అరుండేల్ స్కూల్లో చేర్పించాడు. ఈ స్కూలు ప్రిన్సిపాలూ, అతనూ స్నేహితులు. సగం జీతం మీదే చేర్చుకున్నాడు. ఇక్కడికి రాకముందు అక్కడే ఒక స్కూల్లో చదువుకుంటూ ఉదయం వెళ్ళి సాయంత్రం వచ్చేవాణ్ణి. అది బోర్డింగ్ స్కూలు కాదు. నేను పెరిగి పెద్దవుతున్న కొద్దీ, నా గార్డియన్‌కి, నా ఉనికి ఇబ్బందిగా అనిపించింది. ఎవరివరితోనో సావాసాం చేసి, బజార్ల చుట్టూ తిరుగుతానని, వేటకూ దానికీ వెళతానని, చెడిపోతున్నాననీ అనిపించేది నాకు. కాని నాకు తిరగకుండా కూర్చొని చదువు కోవడమంటే చాలా యిష్టం. ఆయన మా తల్లికి వేలు విడిచిన తమ్ముడు. అతనంటే నాకెప్పుడూ గౌరవం ఉండేది కాదు. అందుకే అతనికి నన్ను చూసి నిరాశ.

కానీ ఇక్కడ నుండి బయట పడటానికి ముఖ్యమైన కారణమేమిటంటే బజార్ల మీద పడి తిరగటానికి, ఇంటికెళ్ళిపోవడానికోకాదు. జామ్ నగర్ లోని మాచిన్నాన పడవ ఎక్కాలని నా ఆశ.

జిమ్ చిన్నాన మానాన్న గారి ఆఖరి తమ్ముడు. అంటే మా సొంత చిన్నాన అవుతాడన్న మాట. అతను నన్ను క్రితం సారి కలిసినప్పుడు నాకు ఐదేళ్ళు. ఇప్పుడు నాకు పన్నెండేళ్ళు. కానీ నాకు జిమ్ అంకుల్ చాలా ఉత్తరాలు రాసారు. ఏవేవో దేశాలనుండి, రంగు రంగు స్టాంపులతికించి అప్పుడప్పుడూ రాస్తుండే వాడు. వాల్‌పరైసో, సాన్‌డియాగో, సాన్‌ఫ్రాన్సిస్కో, బియాన్ ఏర్స్, దార్-ఎ-సలామ్, మొంబసా, ఫ్రీ టీన్, సింగపూర్, బొంబాయి,

మార్సైల్స్, లండన్...ఇలా రకరకాల ఊళ్ళ నుండి - వాళ్ళ ఓడ ఎక్కడెక్కడికెళ్ళేదో అక్కడ నుండి ఉత్తరాలు వ్రాసేవాడు. అతనెప్పుడూ భూమ్మీద ప్రయాణం చేసినట్టుగా అనిపించేది కాదు. అస్తమానం సముద్రం మీద ఓడలెక్కి మంచిమంచి ఓడరేవులు, నాకెంతో ఇష్టమైన ఊళ్ళన్నీ వెళ్ళేవాడు. నేను ఈ రేవులు- స్టీవెన్ సన్, కాప్టన్ మర్యాట్ కన్‌రాడ్, డబ్ల్యు. డబ్ల్యు. జాకబ్స్ లాంటి రచయితల పుస్తకాలు చదవడం ద్వారా తెలుసుకున్నాను. అవన్నీ అద్భుతమైన ప్రదేశాలని వాళ్ళు వర్ణించారు.

ఆయన తన ఉత్తరాల్లో-"నీవు కొంచెం పెద్దవాడయ్యాక నాతో ఓడెక్కి రావచ్చు రస్టీ" అని రాసేవాడు.

నేను పెద్దవాణ్ణయ్యానని నాకనిపించింది. నాకు నన్నాలన్నా, మా గార్డియన్ అన్నా విసుగొచ్చింది. అదొక్కటే కాదు. నాకు ప్రపంచమంతా చూడాలని ఒక గొప్ప ఉత్సాహం. ప్రపంచంలోని మూలమూలలూ చూడాలి. నేను చదివిన పుస్తకాల్లో వర్ణించిన ప్రదేశాలన్నిటినీ చూడాలని అనిపించేది. హాంగ్‌కాంగ్ లోని జంక్స్, సంపన్సాన్, ఇండీస్‌లోని ఈతాకు తోకల కోతులు, లండన్ బజార్లు, తుమ్మచెక్కల్లా మెరిసె ఒంటి రంగున్న ఆఫ్రికన్లు, అమెజాన్ అడవుల్లోని రకరకాల రంగురంగుల పక్షులు, చెట్లు- అన్నీ చూడాలని పిచ్చి కోరిక ఉండేది.

పోయినసారి జిమ్ అంకుల్ రాసిన ఉత్తరంలో నెలాఖరులో అతని ఓడ జామ్ నగర్ చేరుకుంటుంది అని రాసాడు. దాన్ని చూసి నా మనసప్పుడే ఉత్సాహంతో ఉవ్విళ్ళూరింది. నాకోరిక తీరే రోజు దగ్గర పడుతుంది! ఆ ఉత్తరంలో అతను నన్ను రమ్మని ఏమీ రాయలేదు, నిజమే! కానీ నేను సీరియస్ గా వెళ్ళాలనుకుంటున్న విషయం కూడా అతనికి తెలీదు.

జామ్ నగర్ ఏమీ మా పక్కనే ఉన్న ఊరు కాదు నడిచి వెళ్ళి ఓడ ఎక్కెయ్యడానికి. మా పహార గంజ్ అంటే అక్కడే మానాన్నాలుండి- అక్కడనుండి ఎనిమిది వందల మైళ్ళు.

ఎనిమిది వందల మైళ్ళు!

# వెన్నెల్లో సన్నాహాలు

దల్‌జిత్ నాతో రావడానికి ఒప్పుకుని ఉండకపోతే నేను ఇంత పెద్ద ప్రయత్నాలు చేసి వుండకపోయేవాణ్ణి. ఒక్కళ్ళే వెళ్ళడంలో ఏమీ ఉత్సాహం, ఆనందం వుండదు. ముందు ఉత్సాహం చూపించి, మధ్యలో వెనక్కి తగ్గేవాళ్ళున్నా బావుండదు. అలా అయితే ఏదో ఓడిపోయినట్టుగా, నలిగినట్టుగా అనిపిస్తుందెవరికైనా.

దల్‌జిత్ అలాటివాడు కాదు. మాట మీద నిలబడతాడు. ఒకనెల క్రితం నేను ఇలా మా చిన్నాన ఓడ ఉందనీ, నేను దానిలో వెళ్ళాలనుకుంటున్నాననీ చెప్పినపుడు వెంటనే నేనూ వస్తున్నానని చెప్పాడు.

ఆలోచించకుండా మాట్లాడ్డం, పనులు చేసెయ్యడం దల్‌జిత్‌కు అలవాటే. అతను చేసేవన్నీ సరి అని కాదు. అయినా ఏ పనీ సగంలో ఆపేవాడు కాదు, ఎవరేనా తప్పు అని చెప్పి ఆపితే తప్ప.

మా ఇద్దరికీ వర్షాకాలం మారాథాన్ పందాలప్పుడు స్నేహం కలిసింది. నేను బాగా పరిగెత్తేవాణ్ణి. దల్‌జిత్ కొంచెం బొద్దుగా ఉండటం వల్ల, అంత బాగా పరిగెత్తలేక పోయేవాడు. ఒక్కోసారి నేను మిగతా వాళ్ళను పరుగెత్తనిచ్చి, వచ్చిక మీద కూర్చుని ఏ కామిక్కో, డేవిడ్ కాపర్ ఫీల్డ్ నవలో చదువుకుంటూ వుండేవాణ్ణి. ఒక రోజు సాయంత్రం నేను అలా కూర్చున్నపుడు, దల్‌జిత్ ఈల వేసుకుంటూ మెల్లగా నడుచుకుంటూ రావడం చూసాను.

"నీవు పందెంలో లేవా?" అని అడిగాను.

"ఉన్నాను. నీవు? అని అడిగాడు."

"నేనూ ఉన్నాను" అని చెప్పి మరల పుస్తకం చదువుకోసాగాను.

"మనం కొంచెం ఆలస్యం గా కలుసుకుంటే వాళ్ళకేం తెలిదులే అంటూ మనద్దిరం అలా వెళ్ళి అక్కడ అమ్మే వేడి పకోడీలు తిందామా? డబ్బు గురించి ఏం ఆలోచించకు. మా అమ్మ వాళ్ళూ నే చెడిపోయేందుకు సరిపడేంత పంపుతారు" అన్నాడు.

మా ప్రగాఢమైన స్నేహానికి ఆ రోజునుండే మొదలు. మా యిష్టా యిష్టాలు కలిసాయి. పకోడీలంటే యిష్టం. మారథాన్ పరుగు పందాలంటే అయిష్టం- ఇలాటివి మా స్నేహానికి పునాదులు వేసాయి. మేం ఒకరినొకరు ఎన్నో ఏళ్ళగా తెలిసినట్లుగా అనిపించింది.

ప్రస్తుతం చీకట్లో, విశాలమైన జిమ్‌నేషియమ్ లో కూర్చుని మాట్లాడు కుంటున్నప్పుడు, మేం ఒకర్నొకరు బాగా అర్థం చేసుకున్నామనిపించింది. అతను డబ్బున్న వాడని నాకేమీ చిన్నతనం గా అనిపించలేదు. నేను తెలివిగలవాణ్ణని అతను చెప్పడం, దల్‌జిత్‌కు అభిమానంగా అనిపించలేదు. కానీ దల్‌జిత్‌కు నాకంటే ఎక్కువ అనుభవం వుంది. అతనంత స్థిర బుద్ధిగా నేను ఆలోచించలేను.

దల్‌జిత్ తన పైజామా లో దోపుకున్న ఒక కాగితం మడతను విప్పి కింద పరచాడు. అది భారత దేశం రైల్వే మాప్. కిందటిసారి మారథాన్ పరుగుపందాలప్పుడు మేం అడ్డదారి గుండా బజారు కెళ్ళినపుడు కొనుక్కున్న బోలేడు సామానుల్లో ఒకటి. మళ్ళీ మేము పరుగు పందెంలో కలిసిపోయి రేసులో ఫస్టు, సెకండు వచ్చాము. (ఆ తరువాత జడ్జీలకి మేం ఇలా అడ్డదారిని ఉపయోగించినట్టు తెలిసి మమ్మల్ని అనర్హులనుగా చేసారు. కానీ అప్పుడు మాత్రం అందరూ మమ్మల్ని అభినందిస్తుంటే భలే హుషారుగా అనిపించింది.)

మాప్‌ను మా ముందు పరిచిపెట్టుకుని ఎర్ర పెన్సిలుతో హిమాలయాల అడుగు భాగంలో వున్న పహర్ గంజ్ చుట్టూ సున్నా చుట్టాను. ఆ తరువాత కథియవార్ మొన దగ్గర, గల్ఫ్ ఆఫ్ కచ్ వైపుగా వున్న జామ్ నగర్‌ను ఎర్ర

పెన్సిలులో గుర్తు పెట్టాను. వీటి రెండిటి మధ్యా ఏం వుంది? ముందు అడవులు, గుట్టలూ- అవి దాటాక ఢిల్లీ వద్దనున్న జమునా-గంగానదుల మధ్యన దోవాబ్ లోని సారవంతమైన పొలాలు;వాటి తరువాత మట్టి రంగు కొండలు, రాజస్థాన్ అడవులు; వాటినీ దాటి వెళితే గుజరాత్, మహారాష్ట్రాలను అనుకుని వున్న కోస్తా తీర ప్రాంతం. అక్కడక్కడ నదులు, సెలఏళ్ళూ కూడా వున్నాయి. మాకు అందుబాటులో వున్న ప్రయాణ సాధనాలను వుపయోగించి ఏలాగైనా వెళ్ళిపోవాలనుకున్నాము. ఎక్కువ వ్యవధి కూడా లేదు. జిమ్ అంకుల్ పడవ ఓడ రేవులో ఆట్టే చాలా రోజులు ఉండక పోవచ్చు. వర్షాకాలం రాకముందే జూలై నెలాఖరులోనే బయలు దేరవచ్చు.

"మనం వీలయినంత త్వరగా ఢిల్లీ చేరుకోవాలి. లేకపోతే సులభంగా పట్టుబడి పోతాము. ఢిల్లీ నుండి బయట పడితే మనల్ని ఎవరూ పట్టుకోలేరు. మనదేశం చాలా పెద్దది. సులభంగా తప్పించుకోవచ్చు," అన్నాను నేను.

"వీళ్ళు నిజంగా మన కోసం వెదుకుతారంటావా?"

"తప్పకుండా. ఈ ప్రిన్సిపాల్ మా గార్డియన్‌కు స్నేహితుడు కదా? మీ నాన్న గారికి కూడా నీవు తప్పిపోయావని తెలిస్తే స్కూలుపైన దావావేస్తాడు! మనం కనిపించలేదని తెలియగానే, ముందుగా పహార్‌గంజ్ ప్రాంతాలలో వెదుకుతారు. డెహరాడూన్ లో ఎక్కడా దొరక్కపోతే పోలిసు రిపోర్టు యిస్తారు. రైల్వే స్టేషన్లలో, బస్‌స్టాండుల్లో ప్రకటనలు చేస్తారు."

"అంటే మనం ఢిల్లీ దాకా నడిచి వెడుతున్నామా? నేను నూట పాతిక మైళ్ళు నడవలేను" అన్నాడు దల్‌జిత్ భయపడుతూ.

"మనం డెహరాడూన్ వరకూ నడిస్తే చాలు. పన్నెండుమైళ్ళు నడవలేమా? అది దిగుడు దారి కూడాను."

"దిగుడు దారయితే నడవగలననే అనుకుంటాను."

"అక్కడనుండి ఏదైనా రైలో, బస్సో, ట్రక్కో పట్టుకుందాం. వీలయినంతవరకూ రైల్వే స్టేషన్లు రాకుండా చూసుకోవాలి."

"అలాగే రస్టీ, బావుంది. ఇంతకంటే దూరం ఆలోచించవద్దు. ముందు ఢిల్లీ చేరాలి. అక్కడ నుండే మన అదృష్టాన్ని పరీక్షించుకుందాము."

మేమందరూ నిశ్శబ్దంగా ఉన్నాము. మేం దొరికిపోతే ఏమవుతుంది? దారిలో ఎలాటి సమస్యలు ఎదుర్కోవాలో? అంతలో కొవ్వొత్తి ఆరిపోయింది. చుట్టూ చిమ్మ చీకటి, ఎక్కణ్ణుంచో సన్నని వెలుగు నేల మీద పడి, నా కాళ్ళకు పాకింది.

"నీకు నా పెన్సిల్ టార్చ్ నచ్చిందా? నేను క్రితం ఏడాది నైరోబీ లో కొన్నాను. ఇది జేమ్స్‌బాండ్ డిజైన్ చేస్తే, జపాను వాళ్ళు తయారు చేసారుట. బాటరీ వేస్టయి పోతోంది. అయిపోతే ఇక్కడ దొరకదు" అంటూ ఆర్పేసాడు.

"నిన్ను మీ ఇంటివాళ్ళు బాగా ముద్దు చేసి పాడుచేసినట్లున్నారు" అన్నాన్నేను.

"నిజమే, నేను బాగా పాడైపోయాను" మురిపెంగా అని "అయితే, రేపేనా మనం బయలుదేరేది?" అని బాగా గొంతు తగ్గించి అడిగాడు దల్‌జిత్. అసలు గుసగుసగా మాట్లాడవలసిన ప్రమేయం లేదు కానీ అలా నాటకీయంగా మాట్లాట్టం అతనికి ఇష్టం.

"అవును రేపు రాత్రే!"

"ఎక్కడ కలుసుకుందాం!"

"కింద ఉన్న పైన్ అడవుల్లో. ఆ పెద్ద బండవుంది చూడూ-అక్కడ సరిగ్గా పదిగంటలకు. అక్కడ ఒక సెలఏరు ఉంది. దాని ఒడ్డునే నడిస్తే డెహరా కెళ్ళే కవలుదారి వస్తుంది."

"టైముకి సరిగ్గా వచ్చేయాలి సుమా! చీకట్లో ఆ అడవిలో నేను నీ కోసం కాచుక్కూచోలేను. అక్కడ దెయ్యాలున్నాయని కూడా చెప్తారు."

"సరేలే, నీ దగ్గర టార్చ్ వుంది కదా?"

"మనం రేపు స్కూల్లో ఒకరితో ఒకరు మాట్లాడుకో కూడదు. లేకపోతే ఎవరికేనా అనుమానం రావచ్చు. ఇప్పుడు నేను వెళ్ళి పడుకుంటాను. నాకు నిద్ర వస్తోంది."

"బాగా నిద్రపో. రేపట్నుంచి సరిగ్గా నిద్ర వుండదు."

మేము జిమ్నాసియం నుండి బయటకు వెళ్తుంటే, బయట వెన్నెల విరగ కాస్తోంది. చంద్రుడు మెరిసిపోతున్నాడు. పెవిలియన్, డార్మిటరీ బిల్డింగ్ అన్నీ వెన్నెల్లో స్నానం చేస్తున్నట్టుగా వున్నాయి. పొడవాటి దేవదారు చెట్లు కొండలపైకి తమనీడలను విసిరేస్తున్నాయి. ఆకాశంలో ఎక్కడో తప్ప మేఘాలు లేవు. ఆ రాత్రి భలే అందంగా వుంది.

"మనల్నెవరూ చూడరు కదా?" అన్నాడు దల్‌జిత్.

"ఎవరైనా చూస్తే-నేను నిద్రలో నడుస్తుండగా చూసాననీ, అందుకనీ నా వెనకే వచ్చాననీ చెప్పు."

అక్కణ్నుంచీ ఇద్దరూ బయటపడి, గబగబా మెట్లెక్కి డార్మిటారీలో కొచ్చి పడ్డాము. లోపలికి వెళ్ళబోతుండగా దల్‌జిత్ నన్ను చూసి చెయ్యి వూపాడు. నేను గబుక్కున పడక మీదకు చేరి దుప్పటి కిందకు దూరాను. కానీ నిద్ర పట్టలేదు. మేము తలపెట్టిన ప్రయాణం చేయబోయే సాహసం, మమ్మల్ని ఓడలో చూసి మాచిన్నాన ఆశ్చర్య పోవడం వీటన్నిటి గురించి ఆలోచిస్తూ అలా పడుకున్నాను.

నేను నా చార్జీ డబ్బులు ఓడ మీద చిన్న చిన్న పనులు చేసి సంపాదించుకోవాలి. దల్‌జిత్ కూడా నాతో ఉంటాడు.

యొకోహామా, వాల్‌పెరైసో, సాన్‌డియాగో, లండన్!



# దాభాలో టీ తాగడం

స్కూలు నుండి పారిపోవడం! దీన్ని అందరూ ప్రయత్నించకూడదు. తల్లిదండ్రులూ. ఉపాధ్యాయులు హర్షించరు! ఏమో, మనను లో నిజంగా సంతోషిస్తారేమో? జీవితంలో అందరూ ఎప్పుడో ఒకప్పుడు ఇష్టంలేని స్కూలు నుండో, కష్టపెట్టే పరిస్థితులనుండో బయటపడాలని, పారిపోవాలని తప్పకుండా అనుకుని వుంటారు. అలా పారిపోవడం ఒక సాంప్రదాయం కూడా అయిపోయింది. సాహిత్యంలో హక్ ఫిన్, కాపర్ ఫీల్డ్, ఆలివర్ ట్విస్ట్ అందరూ పారిపోయినవాళ్ళే! కిమ్ కూడా. ఎంతో మంది సాహసవంతులైన యువకులు కూడా సముద్రాల పైకి ఓడల్లో వెళ్ళిపోయారు. ఎంతోమంది ప్రసిద్ధులైన వ్యక్తులు కూడా వారి వారి స్కూళ్ళ నుండి పారిపోయారు. అలా పోలేని కొందరు ప్రసిద్ధులు కాలేదు.

ఏది ఏమైనా దల్ జిత్ నేనూ స్కూలు నుండి వెళ్ళి పోదలుచుకున్నాము. బయటపడ్డాము. ఈ విషయాన్ని సమర్థించుకోవడం అనవసరం. ఇదంతా జరిగింది ఇండియాలో కదా! ఇండియాలో రెండు శాతం భూభాగం ఉంది, కానీ పదిహేను శాతం జనాభా ఉంది. ఇక్కడెక్కడ దాక్కున్నా ఎవరూ పట్టుకోలేరు. ఎక్కడైనా, ఎవరికీ కనిపించకుండా దాక్కోవచ్చు.

అలాగని మేము ఎలాగైనా మాయమై పోవాలని అనుకోలేదు. మేము ఫలనా ఊరికి-అదే జామ్ నగర్ కి వెళ్ళాలనే బయలు దేరాము. మేము స్కూలు నుండి మొదటి అడుగు బయటపెట్టినప్పుడే మాకు తెలుసు మేము

ఊరికే పారిపోవడం లేదని. ఒక ధ్యేయం వైపు నడుస్తున్నామని. అది కలే కావచ్చు కానీ మేము వెడుతున్నది ఆ ధ్యేయం వైపే!

పైజామా తొడుక్కుని, చెప్పులు లేని కాళ్ళతో, గుట్టల్ని దాటుకుంటూ కిందికి అడవుల్లోకి వచ్చిపడ్డాము. పైన్ చెట్ల మీద నుండి చల్లటి గాలులు వీస్తున్నాయి. రాత్రి చల్లగా ప్రశాంతంగా వుంది. కింద లోయల్లోంచి నది పారుతున్న చప్పుడు వినిపిస్తోంది. ఆ చప్పుడు మధురంగా ఎవరో గాయకుడు తనకోసం తనే పాడుకునే పాటలాగా వుంది. దట్టమైన మబ్బుల వెనుక నుండి నిండు చంద్రుడు పైకొచ్చాడు. ఆ వెన్నెల్లో చెట్లు, గుట్టలు, గుబుర్లు అన్నీ కాంతివంతమయ్యాయి.

దల్‌జిత్ కొన్ని నిమిషాలు వెనుకగా నన్ను చేరుకున్నాడు. అతను కూడా పైజామా వేసుకున్నాడు. కానీ తల మీద టర్బన్ ఉంది. అందరి సిక్కుల్లాగే దల్‌జిత్‌కి కూడా తలపాగా అంటే గౌరవం. రాత్రి వ్యాటా , ఆటలాడేటప్పుడు మాత్రం దాన్ని తీసి పక్కన పెట్టేవాడు. టర్బన్ లేకుండా పారిపోవాలన్నది అతని ఊహల్లోకి కూడా వచ్చి ఉండదు. పడుకునేటప్పుడు దాన్ని జాగ్రత్తగా తీసి పక్కనపెట్టి, ఒక్క ముడత కూడా పోకుండా, మళ్ళీ ఉదయమే టోపీ లాగా తలమీద పెట్టేసుకునే వాడు.

మేము మాతో బాటు మా జిమ్‌డ్రెస్సులు తెచ్చుకున్నాము. స్కూలుకు వేసుకునే బట్టలయితే అందరికీ తెలిసిపోతుంది. వేరే బట్టలన్నీ ట్రంకుల్లో సర్దిపెట్టుకున్నాము. అందుకని జిమ్ బూట్లు తొడుక్కుని, వీపుకి కట్టుకున్న సంచీ లో మాతిండి సరంజామా, రెండు పుస్తకాలు సర్దుకున్నాము. మా సామానులన్నీ, పక్కబట్టలూ, బాక్సులూ అన్నీ హాస్టల్లో వదిలేసాము.

మేము ఒక సన్నని కాలిబాట వెంబడి నడవడం మొదలు పెట్టాము. అది ఏటవాలుగా ఉంది, తరువాత నది ఒడ్డుతో కలసిపోతుంది. అలా దానితో బాటే, అదే దిక్కుగా ఒక మైలు దూరం, మాట్లాడకుండా గబగబా నడిచాము. ఆ బాటచివర ఒక కవలు దారి వస్తుంది. అక్కడ పక్కకు తిరిగి నడిస్తే చివరి గుట్ట కింద లోయ వస్తుంది.

అక్కడ వరకూబాట సాఫీగా వుంది. మాకు తెలిసిన దారే. గుట్ట చివరికి వచ్చేటప్పటికి వాన మొదలైంది. పెద్ద వాన కాదు కానీ తుంపర. సన్నటి జడి.



దగ్గరలో వున్న పర్వాటూళ్ళోని దాభాలో తలదాచుకున్నాము. ఆ దాభా యజమాని ఇంకా నిద్రపోతూనే ఉన్నాడు. అతని పెంపుడు కుక్క మమ్మల్ని చూసి మొరగలేదు. ఎప్పట్నుంచో తెలిసిన పాత స్నేహితుల్లా, వాసన చూసి తోక ముడుచుకుని పడుకుంది. మేము అక్కడే పక్కన వున్న ఒక పాత బెంచీ మీద కూచుని దూరపు కొండల్లో సూర్యుడు ఉదయించడాన్ని చూస్తూ కూర్చున్నాము.

నాకిప్పటికీ ఆ సూర్యోదయం బాగా గుర్తుంది. నేను చూసిన అందమైన దృశ్యంగా కాదు కానీ ఆ సూర్యోదయానికి ఒక ప్రత్యేకత ఉంది. ఆ ఉదయపు వెలుతుర్లో నాకన్నీ కొత్తగా కనిపించాయి. ఆకాశంలో తెల్లదనం పరుచుకుంటుంటే ఆ వెలుగులో హుందాగా నిలబడ్డ దేవదారు చెట్లు, నిద్ర మేలుకుంటున్న పక్షులు అందాన్ని పెంచాయి. పొదల మాటున ఒక పేరు తెలియని నల్లటి పక్షి ఒకసారి మెల్లగా అరిస్తే, దానితోటి పక్షుల కలకలంతో

పాద పాట పాడుతున్నట్టనిపించింది. పచ్చని చిలుకలు గుంపుగా ఎగురుతూ ఒకచోట, పాడుగాటి చెట్టు మీద అవన్వరంలో ఒక పిట్ట హడావుడిగా అనిపించింది.

అప్పటికి వాన బాగా తగ్గిపోయి సన్నటి తుంపరపడుతోంది. ఆకాశం ఊదారంగు అంచుల మధ్య నుండి మబ్బుల వెనుక దాక్కున్న సూర్యుడు పొడుచు కొచ్చాడు. పచ్చటి గడ్డి తడి ఆరి వూపిరి పీల్చుకుంది. ఆ దృశ్యాలు వింతగా అనిపించాయి. మేము ఎప్పుడూ అంత తొందరగా నిద్ర లేవలేదు, అలాటి దృశ్యం చూడ్డానికి. చెట్ల కొమ్మల్లో, గుబురుల్లో, అక్కడక్కడా గడ్డి మీద కట్టిన సాలెగూళ్ళలో పడిన వాన చుక్కలు ఉదయపుటెండలో బంగారు, వెండి రంగుల్లో మెరసిపోతున్నాయి. ఒక్కొక్క చుక్క సూర్యుడి కిరణాల్లో విలువైన మణిలా అనిపిస్తోంది.

ఒక అడవి చేమంతి పెద్దపెద్ద రేకలు విచ్చుకుని వర్షంతో తడిసి వికసిస్తే, ఒక రేకుపైన పచ్చటి మిడత కాలు చాపుకుని ఒయ్యారంగా విశ్రాంతి తీసుకుంటోంది.

దాభా యజమాని నిద్ర లేచాడు. అతన్ని చూసి ధైర్యం తెచ్చుకుని, కుక్క మమ్మల్ని చూసి మొరగడం మొదలెట్టింది. అతను పొయ్యిలో బొగ్గులు పడేసి, కుంపటి వెలిగించి, దానిపైన కెటిల్‌లో నీళ్ళు మరగడానికి పెట్టాడు.

"మీరేమైనా తింటారా? అని అడిగాడు హిందీలో."

"ఏం వద్దు. టీ చాలు" అన్నాను నేను.

రెండు ఇత్తడి గ్లాసులు టేబిలు పైన పెట్టాడు.

"ఇంకా పాలు రాలేదు. మీరు మరీ తొందరగా వచ్చారు," అన్నాడు.

"మాకు పాలు లేకుండానే టీ ఇవ్వండి. కొద్దిగా చక్కెర ఎక్కువగా వెయ్యండి చాలు" అన్నాడు దల్‌జిత్.

"చక్కెర చాలా ఖరీదు ఈ రోజుల్లో . కానీ మీరు పిల్లలు కదా! మీకు పంచదార కావాలి. ఎంతకావాలో అంత వేసుకోండి."

"మేము స్కూలు పిల్లలం కాము" అన్నాను హడావుడిగా.

"నిజంగా కాదు" దల్‌జిత్ గొంతు కలిపాడు.

"మేము టూరిస్టులము," అన్నాను.

"డెహరాడూన్‌కి వేళ్ళే మొదటి రైలు పట్టుకోవాలి" అన్నాడు దల్‌జిత్.

"పది గంటల కంటే ముందు ఏ రైలూ లేదే!" అన్నాడు దాభా యజమాని.

"అదే, మేము పదిగంటల బండికే వెళ్ళాలి. అందుకోగలమంటావా?" అన్నాడు దల్‌జిత్ తెలివిగా.

"ఓ, చాలా టైముంది... " అంటూ గ్లాసులో టీ పోసి చక్కెర మాముందుంచాడు.

"మిమ్మల్ని చూసి ముందు నేను స్కూల్లో చదివే పిల్లలనుకున్నాను. స్కూలు నుండి పారిపోతున్నారని అనుకున్నాను."

భయాన్ని దాచుకుని పిరికిగా నవ్వుతూ-

"మీరలా ఎందుకనుకున్నారు?" అడిగాడు దల్‌జిత్.

"ఓ...నేనిక్కడ చాలా ఏళ్ళుగా ఉన్నాను. స్కూలు నుండి పారిపోయే కుర్రాళ్ళందరూ ఇలాగే, ఇదే దారిలో వెళ్తారు."

"చాలా మంది పారి పోతుంటారా?" అని అడిగాను.

"చాలామంది కాదు గానీ ఏడాదికి ఇద్దరు ముగ్గురు పారిపోతుంటారు. కానీ డెహరాడూన్ రైల్వేస్టేషన్ చేరేటప్పటికి పట్టుపడి పోతూంటారు."

"పిరికి వాళ్ళే అలా పట్టుపడి పోతారు," దల్‌జిత్ అన్నాడు.

"అందరూ పట్టుపడిపోతారా?" అని అడిగాను.

"తప్పకుండా! ఇలా వెళ్ళేటప్పుడు నా కొట్లోనే టీ తాగి వెళ్తారు. మళ్ళీ తిరిగి వెళ్ళేటప్పుడు కూడా టీ తాగడానికి ఇక్కడికే వస్తారు. అప్పుడు వాళ్ళ తో వాళ్ళ టీచర్స్ వుంటారు."

"సరే , మమ్మల్ని మళ్ళీ చూసే అవకాశం మాత్రం మీకుండదు-నేను కళ్ళతో చేస్తున్న హెచ్చరిక పట్టించుకోకుండా అనేసాడు."

"కానీ మీరు స్కూలు పిల్లలూ కారూ- మీరు పారిపోవడం లేదు కూడానూ" అన్నాడు దాభా యజమాని.

మేము టీకి డబ్బులిచ్చేసి గబగబా నడవడం మొదలు పెట్టాము. ఎగురుతున్న చిలుకలు కీచుమంటూ అరుస్తున్నాయి. సూర్యుడు పైకొచ్చి వాతావరణం అంతా ఎండకాసింది. కొండలు దిగి ఎత్తునుండి కిందికి రావడం వల్ల వాతావరణంలో తేమ ఎక్కువై చెమటలు పడ్తున్నాయి. పొలాల్లో అంతా వరి నాటారు. చెరకు పంట అప్పుడే నడుము ఎత్తుకు పెరిగింది.

దారి బురదగా జారుతోంది. మేము బూట్లు విప్పేసి, న్యూస్ పేపర్లో చుట్టుకుని, ఉత్తికాళ్ళతో నడవడం మొదలెట్టాము.

"ఇక్కణ్ణుంచీ డెహరాడూన్ మూడు మైళ్ళు ఉంటుంది" అన్నాన్నేను. "ఇలా టౌను చుట్టుకుని వెళ్లాలి. ఈపాటికి స్కూలులో అందరూ నిద్ర లేచి వుంటారు. మనం పారిపోయినట్టుగా అందరికీ తెలిసిపోయి వుంటుంది."

"మనం స్టేషన్‌కు వెళ్ళకూడదు" అన్నాడు దల్‌జిత్.

"అలాగయితే మనం తరవాతి స్టేషన్ రేయ్‌వాలాకి వెళ్ళి, అక్కడికొచ్చే మొదటి ట్రైను పట్టుకుందాం."

"దానికెంత దూరం నడవాలి?"

"దాదాపు పదిమైళ్ళు."

"పదిమైళ్ళే! రోజంతా నడవాల్సివస్తుంది!"

"మరేం చేద్దాం? ఇక్కడ ఆగడానికి లేదు-డెహరాడూన్‌కి వెళ్ళడానికి వీల్లేదు. అందుకే అలా నడుస్తూ వుండాలి."

"అలాగే చేద్దాం రస్టీ. నడుద్దాం-తప్పదు. ఏ సాహసానికైనా మొదట్లో ఇలాగే కష్టాలు ఎదుర్కోవలసి వస్తుంది."



# పులులూ—ఎద్దు బళ్ళ ప్రహసనం

అప్పటికే పొలాలన్నీ అడవి దారిలో కలిసిపోతున్నాయి. రైల్వే లైనును ఆనుకుని కొన్ని చెరకు తోటలు కనిపిస్తున్నాయి దూరంగా.

"ఇంకా ఎంత దూరం నడవాలి? రేయ్‌వాలా స్టేషను అడవి మధ్యలో ఉందా?" అని అడిగాడు దల్‌జిత్.

"అలాగే అనిపిస్తోంది. మనం ఒక నాలుగుమైళ్ళు నడుచుంటాము. మరో ఆరు మైళ్ళు నడవాలి. మైళ్ళు ఎందుకు ఇంత దూరంగా అనిపిస్తాయి? ఈ దూరాలు మన ఆలోచనల్ని బట్టి వుంటాయి కాబోలు. మన ఆలోచనలు హుషారుగా వుంటే దూరాభారాలు తెలియవని అంటారు."

"అలాగయితే మనం సరదాగా ఏవైనా మాట్లాడుకుందాం. రస్టీ, ఇక్కడెక్కడ దగ్గర దారి లేదా? నీవిదివరకు ఈ అడవుల్లో వచ్చావా?"

"ఇక్కడో అడ్డదారుంది. దాన్ని 'ఫైర్‌పాత్' అంటారు. కానీ ఆ దార్లో ఒక చిన్న వాగువస్తుంది. ఈదుకుని దాటేయొచ్చు. వర్షాలు ఇప్పుడే మొదలయ్యాయి కదా? నీళ్ళు అట్టే వుండవు."

అడవిలో దార్లను అక్కడక్కడా నరికేస్తారు. అలాగయితే కార్చిచ్చు సులభంగా అన్ని చోట్లకూ అంటుకోదు. ఈ దారుల్లో ఎవరూ ఎక్కువగా నడవరు, ఎందుకంటే అవి ఎక్కడా కలవవు కాబట్టి. కానీ ఈ దారిలో పెద్ద పెద్ద జంతువులు తిరుగుతూ వుంటాయి.

మేము ఒక మైలు దూరం వెళ్ళేటప్పటికి నీరు పారుతున్న చప్పుడు

వినిపించింది. మేం నడుస్తున్న దారి సాల్ అడవుల మధ్య నుండి వెళ్ళి ఒక చిన్న వాగు వద్దకు వచ్చి కలిసింది. ఆ వాగుకు వంతెన మూడుమైళ్ళ దూరంలో వుంది.

"ఈ వాగులో నీళ్ళు మొలలోతు కంటే ఎక్కువుండదు. కానీ నీరు వేగంగా ప్రవహిస్తుంది. నీటిలోని రాళ్ళు నున్నగా జారుడుగా వుంటాయి" అని చెప్పాను.

మేము బట్టలిప్పేసి, వాటిని మూటగా కట్టుకుని తలమీద పెట్టుకుని నీటిలో దిగాము. దల్‌జిత్ పొడుగ్గా, ధృడంగా వుంటాడు. నేను కొంచెం పీలగా అనిపించినా అతని కంటే హుషారుగా వుంటాను.

కాళ్ళకింద రాళ్ళు జారుతుంటే ఒకళ్ళనొకళ్ళు పట్టుకుని ముందుకు నడిచాము. కానీ మేము పట్టుకోవడం ఆసరాగా అనిపించలేదు. అడ్డంకిగా అనిపించింది. మేము నది మధ్య వరకూ నడిచి, మొలలోతు నీటిలో నిలబడి ఇక ముందుకు నడవడానికి భయపడి ఆగిపోయాము. కొట్టుకు పోతామేమో అని భయం వేసింది.

"నేను నిలబడలేక పోతున్నాను" అన్నాడు దల్‌జిత్.

"ఇంతకంటే లోతు ఉండదులే" అని నేను అన్నా, నాకూడా మోకాళ్ళు వణకడం మొదలెట్టింది.

దల్‌జిత్ కొంచెం ముందుకు వెళ్ళాడు. జారి నీళ్ళ మీద వెల్లకితలా పడ్డాడు. నన్ను పట్టుకున్నాడు కదా, నేనూ పడ్డాను. కాళ్ళూ చేతులు కొట్టుకుని, నా ఆసరాతో తిమింగలంలా పైకి తేలాడు.

మేము కొట్టుకుని పోవడం లేదు అని తెలియగానే , ధైర్యంతో మెల్లగా నిలిచి నిలిచి అడుగులేసుకుని అవతలి ఒడ్డుకు చేరాము.

అక్కడ వెచ్చటి ఇసకపైన సేద తీర్చుకున్నాము. దల్‌జిత్ తన చేతికి తగిలిన గాయాన్ని వేలిని నోట్లో పెట్టుకుని చప్పరించుకున్నాడు. మళ్ళీ లేచి నిలబడి నడక సాగించాము. ఆకలి వేసింది. బిస్కట్లు తీసుకుని తింటూ నడవ సాగాము.

"ఇంకెంతో దూరం లేదు" అన్నాను.

"నేను దాన్ని గురించి ఆలోచించదల్చుకోలేదు" అన్నాడు దల్‌జిత్.

ఆ అడవి దారిలో అలా నడుస్తున్నాము. అలసటగా అనిపించింది కానీ నిరుత్సాహంగా అనిపించలేదు. మళ్ళీ అక్కడొక మలుపు వచ్చింది.

అక్కడ మా ఎదురుగా ఒక పులి!

ఎదురుగా అంటే మరీ ముఖాముఖీ కాదు, ఓ పదిహేను గజాల దూరంలో దారికి మధ్యగా నిలబడి వుంది. దానికి కూడా మమ్మల్ని చూసి ఆశ్చర్యంగా అనిపించి వుండవచ్చు. తలెత్తి మమ్మల్నోసారి పరికించి చూసి, తోక ఆడించింది. కానీ ముందుకు రాలేదు. మేము అలా దారి మధ్యలో కదలకుండా నుంచుండి పోయాము. ఇంకేం చేయడానికీ తోచనంత భయం వేసింది. మేము అరిచి పరుగులు పెడితే మీద పడుతుందేమో అని భయం. కానీ ఈ పులికి మనుషుల్ని చూస్తే భయం వున్నట్టు లేదు. ఇది మనుషుల్ని తినే రకంగా అనిపించలేదు. మెల్లగా గాండ్రించి, ఒక నిమిషం అటూయిటూ చూసి అడవిలోకి వెళ్ళిపోయింది.

మాకు అప్పుడు కొంచెం గొంతు పెగిలింది. నీవిక్కడ పులులుంటాయని చెప్పలేదేం? అన్నాడు గుసగుసగా.

"నేను దీన్ని గురించి ఆలోచించలేదు" అన్నాను. ఆ మాట నిజమే. "కానీ ఎక్కువగా లేవు..."

"ఇప్పుడు మనం ముందుకెళ్ళాలా? వెనక్కా?"

"ముందుకే! నీకు మళ్ళీ నదిలో నడవాలని సరదాగా వుంటే వెనక్కి వెడదాం. అయినా ఈ పులికి మన పట్ల పెద్దగా యిష్టం ఉన్నట్టు లేదు."

"అయితే నడు" అంటూ ముందుకు నడిచాడు దల్‌జిత్. కానీ ఆ దారిలో మృగాలు కనిపించలేదు. కానీ కొన్ని అద్భుతమైన నెమళ్ళు కనిపించాయి. మమ్మల్ని చూసి రెక్కలార్పుకుంటూ పక్కకు వెళ్ళి పోయాయి.

కొంచెం సేపట్లోనే మాకు రహదారి తగిలింది. దారికి రెండు పక్కలా పొలాలూ, దూరంగా పల్లెటూళ్ళూ కనిపించాయి. కొండగాలి మైదానం దాటి వచ్చి చల్లగా తగిలింది. ఆ గాలికి చెరకు పైరు అందంగా వూగుతూ కనిపించింది. ఆ గాలి దారిలోని తేలిక మట్టిని లేపి, మా చుట్టూ దుమ్ములా వచ్చింది. ఆ దుమ్ములో నుండి, మా వెనుక ఒక ఎద్దు బండి చప్పుడు

వినిపించింది.

"హెూ, హెూయ్, ఓహెూయ్" అంటూ అరుస్తున్నాడు బండి వాడు. ఎద్దులు రంకె వేసుకుంటూ ఆ దుమ్మునుండి బయటి కొచ్చాయి.

"మీరు రేయ్‌వాలా వెళ్తున్నారా? మమ్మల్ని మీతో తీసికెళ్ళగలరా" అని అడిగాడు దల్ జిత్

"ఎక్కండి" అన్నాడు బండివాడు.

మేము పరిగెత్తుకుంటూ వెళ్ళి, కదులుతున్న బండిలోకి ఎక్కాము.

బండి కుదుపులకి పడిపోకుండా గట్టిగా పట్టుకున్నాము. బండంతా గడ్డి వానవా, పిడకల వాననా వేస్తోంది. బండివాడు తలకు ఎర్రటి తలపాగా చుట్టుకుని, ధోవతీ కట్టుకుని, బిగుతుగా ఒక చొక్కా వేసుకున్నాడు. బీడీ తాగుతూ ఎద్దులతో ఏవో అంటూ, అతను మేము వున్న విషయమే మరచిపోయినట్టున్నాడు. మేము కూడా కిందపడి పోతామన్న భయంతో బండిని గట్టిగా పట్టుకుని మాట్లాడుకోవడం మానేసాము. చూస్తుండగానే మా బండి రేయ్‌వాలా బజారు వీధిలోకి వచ్చేసింది. అది చిన్న ఊరయినా బాగా హడావిడిగా ఉంది. మేము బండి నుండి కిందికి గెంతినట్టుగా దిగి, దాని పక్కనే నడవసాగాము.

"మనం ఈ బండి వాడి కేమన్నా డబ్బివ్వాలా?" అని అడిగాను.

"వద్దు. అతనేమైనా అనుకుంటాడేమో! టాక్సీ కాదు కదా!"

"సరే అయితే. మామూలుగా థాంక్స్ చెప్పి వెళ్దాము."

బండివాడితో 'థాంక్స్' అని గట్టిగా అరిచాము. కాని అతను తిరిగి చూడలేదు,' తన ధోరణిలో ఎడ్ల తో ఏవో కబుర్లు చెప్పేస్తున్నాడు.

"నాకు ఆకలేస్తోంది. మనం నిన్న రాత్రి నుండి సరిగ్గా భోజనం చెయ్యలేదు,"' అన్నాడు దల్ జిత్.

"అయితే పద, భోజనం చేద్దాము" అని బజారులో అటూ ఇటూ చూసుకుంటూ ముందుకు నడిచాము. పెద్ద హెూటళ్ళూ, స్వీటు దుకాణాలను దాటి అతి మామూలుగా ఉన్న చిన్న దాభాలోకి వెళ్ళాము. అక్కడ వడ్డించే కుర్రాడు అన్నం, పప్పు తెచ్చి వడ్డించాడు. దల్ జిత్ వాణ్ణి

నెయ్యి తెమ్మని, ఒక జొన్ను నెయ్యి కూర మీద వేసుకున్నాడు. అక్కడ భోజనం ఖరీదు రెండు రూపాయలే. అన్నం మళ్ళీ వడ్డించరు గానీ, పప్పు ఎంతైనా వేస్తామని అన్నారు. మా ఇద్దరి మధ్య, మేము నాలుగుసార్లు పప్పు అడిగి వేయించుకున్నాము.

"మనం స్టేషనుకెళ్ళి విశ్రాంతి తీసుకుందాము" అన్నాను నేను. దాభా నుండి బయటపడి స్టేషను చేరుకున్నాము. "మనం సెకెండు క్లాసు టికెట్లుకొని, ఫస్టుక్లాసు వెయిటింగ్ రూములో కూర్చుందాము. మనల్నెవరూ చెక్ చేయరులే. చూడ్డానికి ఫస్ట్‌క్లాసు ప్రయాణీకుల్లా లేమూ?"

"ఆ అడవిలో నడిచి వచ్చాక మన మొహాలు ఫస్ట్‌క్లాసుగా లేవులే" అన్నాడు దల్‌జిత్.

కానీ మేము ఆస్టేషనులో వున్న వెయిటింగ్ రూములో కూర్చున్నాము. దల్‌జిత్ చాలా సుఖంగా వుండే కుర్చీ చూసి దానిపైన అనుకుని కూర్చున్నాడు. "రైలు రాగానే లేపు" నిద్ర కూరుకు వస్తోంది అతని కళ్ళల్లోకి.

కానీ మేము రైలు కోసం ఎంతోసేపు ఎదురు చూడలేదు. నేను అక్కడున్న తలుపు నానుకుని, రైలు పట్టాలను చూస్తుంటే దూరంగా రైలు కూత వినిపించింది. దాని వెనకే రైలు మెల్లిగా, బుసలు కొడుతున్న ఆవిరితో వచ్చి ఆగింది. ప్లాట్‌ఫాం మీద నిలబడి వున్న గుంపు తొక్కి, తోసుకుంటూ రైలు పెట్టెల్లోకి చొరబడుతున్నారు.

నేను దల్‌జిత్‌ను కుదిపి లేపాను. ఇద్దరం బయటికి వచ్చి ప్రయాణీకుల గుంపులో కలిసాము. ఆడా, మొగా, పిన్నా, పెద్దా, అందరూ ఒకళ్ళనొకళ్ళు తోసుకుంటున్నారు. లోపలి వాళ్ళు బయటకు రాలేక పోతున్నారు. బయటి వాళ్ళు లోపలికి పోలేక పోతున్నారు. కిటికీల్లోంచి మూటాముల్లె లోనికి తోస్తున్నారు. కొందరు కుర్రాళ్ళు, మా కన్నా పెద్ద కుర్రాళ్ళు కిటికీ గుండా లోనికి వెళ్ళడానికి ప్రయత్నం చేస్తున్నారు. కొందరు వాళ్ళను లోపలికి తోస్తున్నారు. నేను, దల్‌జిత్ మా సామానులను గట్టిగా పట్టుకున్నాము. ఆ గందరగోళంలో, తొక్కిసలాటలో ఎలాగో లోపలికి వెళ్ళి పడ్డాము. అలాగే తోసుకుంటూ వెళ్ళి మూలగా ఉన్న సీట్లో కూర్చున్నాము. అంతలో రైలు బయలుదేరింది. అయినా ఇంకా కొంతమంది రైలు పెట్టె కమ్మీని పట్టుకుని

తలుపు, కిటికీల వద్ద లోపలికి వచ్చే ప్రయత్నం చేస్తూ వేళ్ళాడుతున్నారు.

నేను కిటికీ పక్కగా కూర్చున్నాను. రైలు స్పీడు అందుకునేటప్పటికి పక్కగా ఉండే మామిడి తోపు, టెలిగ్రాపు స్తంభాలు, పల్లెటూళ్ళూ గబగబా వెనక్కి వెళుతున్నాయి. అంటే మేమనుకున్న, వెళ్ళాలనుకున్న తెలియని ఆ అద్భుత ప్రపంచంలోకి వెళ్తున్నామన్నమాట. నేను ఉత్సాహంగా దల్ జిత్ జబ్బ పట్టుకుని, "మనం దారిలో పడ్డాము" అన్నాను.

"పడ్డట్టే" అన్నాడు దల్ జిత్. అతని సామానుల నంచి మీద ఒక లావుపాటి ఆయన పడుకుని నిద్ర పోతున్నాడు. అతని కిందనుండి దాన్ని లాక్కోవాలని చూస్తున్నాడు దల్ జిత్. దాన్ని విడిపించుకున్నాక, దల్ జిత్ కి నేను చెప్పున్నదేమిటో అర్థమయి కళ్ళు మెరిసాయి.

# క్షణంలో తప్పిన ప్రమాదం

పాత ఢిల్లీ స్టేషను రాగానే మేమిద్దరం చాలా మామూలుగా, గౌరవంగా ప్రయాణం చేసే ఇతర ప్రయాణీకుల్లాగానే ధైర్యంగా కిందికి దిగి, బయటికి వెళ్ళే వారి దగ్గర టికెట్టు ఇన్స్పెక్టర్‌కి అందించాము. గుంపు బాగా ఎక్కువగా ఉంది. ఇదీ ఒకందుకు మంచిదయిందనుకున్నాము. కానీ అక్కడికి ముప్పై అడుగుల దూరంలో టికెట్ ఇన్స్పెక్టర్‌తో మాట్లాడుతున్నవ్యక్తి మా లెక్కల టీచరు మిస్టర్ జైన్‌ను చూశాను.

మిస్టర్ జైన్ మా అరుండేల్ స్కూలంతటిలో చాలా సమర్థవంతమైన టీచరు. అందుకే అతన్ని మమ్మల్ని వెదకమని పంపించి వుంటారు. మిస్టర్ జైన్ కొంచెం పొట్టిగా వుండి, కళ్ళజోడు పెట్టుకుంటాడు. మమ్మల్ని ఎక్కడ వెతకాలో అతనికే బాగా తెలిసినట్లుంది. మేము అక్కడ నుండి జారుకోవాలనుకున్నాము.

“పద, పద, ఇక్కడనుండి వెళ్ళిపోదాం” అన్నాను దల్‌జీత్‌ని పట్టుకుని లాగుతూ. కొంచెం గొంతు తగ్గించి.

“ఎందుకు” అన్నాడు దల్‌జీత్. అతను మిస్టర్ జైన్‌ని చూసినట్టు లేదు.

“టికెట్టు కలెక్టర్‌తో ఎవరు మాట్లాడుతున్నారో చూడు,” అన్నాను.

దల్‌జీత్ తప్పుకోబోయి తూలి పడేటట్టనిపించాడు. ఎటూ కదలనీయని ప్రయాణీకుల గుంపు మమ్మల్ని కదలనివ్వలేదు. అంతలో

మిస్టర్ జైన్ మమ్మల్ని చూడనే చూసాడు.

"అబ్బాయిలూ, రస్టీ, దల్‌జిత్, ఇలా రండి ! అంటూ గట్టిగా పిలిచాడు."

అలవాటయిన ఆ గొంతు పిలుపును అనుసరించాలనిపించింది. కానీ వెంటనే భూతాకారంగా క్లాస్‌రూములు, డార్మిటరీ, సీరియస్ గా ఉండే ప్రిన్సిపాల్, ఎలుక మీసాల్లాటి ముఖం, వీటికి దూరంగా మా చిన్నాన ఓడ వుండే సముద్రం వచ్చేదాకా తిరిగి చూడకుండా పారి పోవాలనిపించింది.

దల్‌జిత్ ఒక క్షణం కూడా ఆలస్యం చెయ్యకుండా బలంగా ఉండే ఒక జాట్ రైతు కాలి కింద దూరిపోయాడు. అలా చేసేటప్పుడు అతని టర్బను కూడా కింద పడిపోయింది. నేను ఇద్దరు లావుపాటి పంజాబీ ఆడవాళ్ళ మధ్యలో దూరాను. జైన్ నన్ను అమాంతం పట్టుకునేంత దగ్గరలో వచ్చాడు కానీ ప్లాట్‌ఫామ్ మీద వున్న ఒక కూలీ అతన్ని ఢీ కొట్టాడు. జైన్ కింద పడ్డాడు. అతని కళ్ళద్దాలు కూడా పడిపోయాయి. నేను తప్పించుకుని దల్‌జిత్ చేయిపట్టి, తోసుకుంటూ ఆ గుంపులోంచి చొచ్చుకుని పరిగెత్తాను.

"రస్టీ, పరిగెత్తు! రైలు పట్టాల కడ్డంగా పరిగెత్తి" రా అన్నాడు దల్‌జిత్.

దల్‌జిత్ ప్లాట్‌ఫాం కిందకు దూకి, అక్కడ నిలబడి వున్న రైలు పెట్టె కిందకు దూరాడు. నా కిష్టం లేక పోయినా నేనూ అతని వెనకే వెళ్ళాను. నాకెందుకో రైలు పట్టాలకు అడ్డంగా వెళ్ళడం అశుభంగా అనిపిస్తుంది. నాకు ఒక్కోసారి నేను నిస్సహాయంగా రైలు పట్టాల మీద పడివున్నట్టు గా, నామీద నుండి రైలింజను వెళ్ళినట్టుగా కలలు వస్తాయి. కొన్నిసార్లు రైలు ఇంజను నాకు మూడు అడుగుల దూరంలో ఆగిపోతుంది. అప్పుడు నాకు మెలకువ వస్తుంది! ఒకవేళ చివరి వరకూ మెలకువ రాకపోతే!

దల్‌జిత్ అప్పటికే రెండు, మూడు పట్టాలు దాటి అవతలివైపు కమ్మీలు పట్టుకుని పైకి వచ్చాడు. నేను అటూ, ఇటూ చూసాను.దూరంగా పట్టాల మీదుగా ఒక ఇంజను వస్తోంది నావైపే! అది వచ్చేంతలో నేను దాటొచ్చు, కానీ నాకెందుకో భయంతో చెమటలు పట్టేంది.

"రస్టీ, తొందరగా రా" అరిచాడు దల్‌జిత్.

నేను బలంగా ఊపిరి పీల్చి ఎదురుగా చూసుకుంటూ రైలు పట్టాలకు అడ్డంగా పరిగెత్తాను. కానీ భయంతో తట్టుకుని కింద పడిపోయాను.

కడుపులో తిప్పినట్టుగా అయి, కింద భూకంపం వచ్చినట్లుగా అనిపించింది. నా పీడకల నిజమవబోతోందా? దూరంగా దల్‌జిత్ అరవడం వినిపిస్తోంది. ఇంజన్ పొగలు కక్కే చప్పుడు కూడా వినిపిస్తోంది.

"రస్టీ, లే, పైకిలే " దల్‌జిత్ గొంతు నా చెవి దగ్గరగా వినిపించింది. అతను నా చేయి పట్టుకుని లేపుతున్నాడు.

అతన్ని చూసి నాకు ధైర్యం వచ్చింది. నేను లేచి నిలబడి, సంచి గట్టిగా పట్టుకుని అతని వెనకే పరిగెత్తాను. దారిలో ఇనుపముళ్ళతో చేసిన ఒక కంచె అడ్డం వచ్చింది. అది పది అడుగుల ఎత్తులో వుంది. ఎక్కడా కాలుపెట్టి ఎక్కే అస్కారం కనిపించలేదు. మేము విధిలేక కంచె వెంబడే పరిగెత్తి గూడ్స్ బళ్ళు నిలబడే చోటికి వెళ్ళి చేరాము.

అక్కడ, పక్కనే వున్న చిన్న సందుగుండా బయటపడి ఒక వీధిలోకి వచ్చాము. అలా పరిగెడుతూ పోతే చిన్నచిన్న మసీదులు, గుళ్ళు, షాపులు, నాట్యశాలలు అన్నీ పక్కపక్కనే వున్న గల్లీలు కనిపించాయి. ఆ గల్లీ దాటేటప్పటికి పెద్దబజారు, చాలామంది జనం, బజారు ట్రాఫిక్ గోలతో కనిపించింది.

మేము చాందినీచౌక్ కు వచ్చామని తెలుసుకున్నాము. అది ఢిల్లీలో అతి పురాతనమైన బజారు. అక్కడ వెండి నగలు చేసే వర్తకులు వుంటారు.



# చాందినీచౌక్ లో కాస్త విశ్రాంతి

ఇక్కడ, చాందినీచౌక్‌లో బోలెడు షాపులు, వీధుల్లో ఫుట్‌పాత్‌ల మీద అమ్ముకునేవారు, అడుక్కుతినే కుర్రాళ్ళు, సాధువులు, మంగలివాళ్ళు, జేబుదొంగలు, బంగారంషాపులు-రకరకాలవాళ్ళు. వీళ్ళ మధ్య మాక్కొంచెం స్థిమితంగా అనిపించింది. ఎప్పుడైనా తప్పించుకోవాలంటే, నగరం నడిబొడ్డున హడావిడిగా వుండే స్థలమే మంచిది. తప్పు చేసిన వాళ్ళు ఎప్పుడూ దూరంగా ఉన్న ఏదో ఊరికి వెళ్ళి తలదాచుకోడానికి ప్రయత్నిస్తారు. అక్కడ అందరూ వీళ్ళను గుర్తు పట్టేస్తారు. కానీ మేము అనుకోకుండా ఢిల్లీలో అతిక్షేమంగా అనిపించే ప్రాంతానికి వచ్చి చేరాము.

టాంగాలు, ఎద్దుబండ్లు, సైకిళ్లు, రిక్షాలు, కార్లు-పాతవీ,కొత్తవీ అన్నీ ఒకదానితో ఒకటి అక్కడ వీధుల్లో పోటీ పడుతున్నాయి. బెల్ వున్న వాళ్ళు గంటలు మోగిస్తున్నారు, హారన్ వున్న బళ్ళు చెవులు చిల్లులు పడేలా హారన్ మోగిస్తున్నారు. రెండూ లేని బళ్ళవాళ్ళు తమ గొంతునే ఉపయోగించి తప్పుకోమని హెచ్చరిస్తున్నారు.

మాకు ఒక చిన్న మిఠాయి దుకాణం కనిపించింది. పాకంలో తడిసిన బ్రౌన్ గులాబ్ జామూన్‌ను దల్‌జిత్ తీసికుని తినేశాడు. నేను బంగారు రంగులో నోరూరించే జిలేబీలు తిన్నాను.

అంతలో చిన్నగా జల్లులు పడితే పక్కనే ఉన్న ఒక వరండా కప్పు కింద తలదాచుకున్నాము. వర్షం కొంచెం ఎక్కువయ్యేటప్పటికి వీధుల్లోని జనం

ఎక్కడివారక్కడ తప్పుకుని వీధులన్నీ ఖాళీగా అనిపించాయి. వర్షాన్ని లెక్కపెట్టని ఒకటీ అరా కార్లూ, చెత్తా చెదారం, నెమరేసే రెండు మూడు ఆవులు తప్ప ఇంకేమీ అచ్చట కనిపించటం లేదు.

ఎక్కణ్ణుంచో ఒక చిన్న పిల్లల గుంపు నది హోరులాగా తుళ్ళుతూ వచ్చారు. అక్కడ నీళ్ళు నిండివున్న కాలువ చూసి నవ్వుకుంటూ కేరింతలు కొట్టుకుంటూ అందులోకి దూకారు. ఒక బంతిపూల మాల నీటిలో తేలుకుంటూ వచ్చింది.

ఉన్నట్టుండి వర్షం ఆగిపోయింది. ఎండకాయడం మొదలైంది. నా కాళ్ళ సందు నుండి ఒక కాగితప్పు పడవ తేలుకుంటూ వెళ్ళింది.

"ఇప్పుడెక్కడికెడదాం? స్టేషన్‌కెళితే ప్రమాదం కదా?" దల్‌జిత్ అన్నాడు.

"మనం ఎలాగైనా ఢిల్లీ నుండి బయట పడాలి. ఈ రాత్రికి ఎక్కడేనా ఒక చిన్న హోటలులో ఉందాము" అన్నాను.

"అలాగే, నా దగ్గర ఇంకా ముప్పై రూపాయల పైచిలుకు వుంది," అని చెప్పాడు దల్‌జిత్.

"నా దగ్గరా ఒక ఆరు రూపాయలున్నాయి. కానీ మనం టికెట్టు కొనడానికి డబ్బు సరిపోదు."

"అలాగైతే, టికెట్టు కొనడం మానేద్దాము" ఇది దల్‌జిత్ ఆలోచన.

మేము హోటల్ కొరకు ఎక్కువసేపు వెదకలేదు. పోలీసుస్టేషన్ వెనకాలే గ్రేట్ ఓరియంటల్ అని ఒక హోటలు కనిపించింది. అది చాలా నాసిరకం హోటలు లాగానే వుంది. వాడు మాకు ఏడు రూపాయలకు ఒక రూము యిచ్చాడు. ఆ చిన్న రూము గది కిటికీ తెరిస్తే, వెనుక ఆఫ్ఘన్ వ్యాపారులు అమ్మే సుగంధ ద్రవ్యాల గోడౌన్లు వున్నాయి. అక్కడి నుండి ఘాటైన ఇంగువ వాసన మా ముక్కుల్ని అదరగొట్టేస్తుంది.

మాకు అలసటగా, ఉక్కగా అనిపిస్తోంది. మా సామానుల్ని ఒక మూల పక్కగా పెట్టి బాత్‌రూమ్‌లోని కుళాయి కింద ఒకరి తరువాత ఒకరు స్నానం చేసాము. తరవాత అక్కడే వున్న మంచం మీద పడుకొని మధ్యాహ్నమంతా నిద్ర పోయాము. బయట నుండి వచ్చే శబ్దాలు కానీ, ఆ గదిలోని దరీపై

తిరిగే క్రిమికీటకాలు గానీ, పైన చప్పుడూ చేసుకుంటూ తిరుగుతున్న ఫాన్‌గానీ మా నిద్రకు ఆటంకం కలిగించలేదు.

చీకటి పడే వేళకు, మాకు మెలకువ వచ్చింది. మళ్ళీ ఆకలి వేయడం మొదలెట్టింది. గది తలుపు తీసి కేకేస్తే బయట ఉన్న ఒక పని కుర్రాడు వచ్చాడు.

"మాకు టీ, టోస్టు, రెండు పెద్ద ఆమ్లెట్లు, ఒక సీసా టొమాటో సాస్ తీసుకురా," అని ఆర్డరిచ్చాడు.

ఒక ఇరవై నిమిషాల తరువాత ఆమ్లెట్లు తెచ్చాడు. అవి చిన్నగా ఉన్నాయి. ఒకే గుడ్డుతో రెండు చేసినట్టున్నారు. సాస్ నీళ్ళగా వుంది. టోస్ట్ మాడిపోయింది. ఉప్పు నీళ్ళు కారిపోయి సీసానుండి పడటం లేదు. మిరియాల పొడి మాత్రం దండిగా పడిపోయింది. మాకింకా ఆకలిగా అనిపించి రెండు ఉడకబెట్టిన గుడ్లుకు ఆర్డరిచ్చాము. ఎంత చిన్నవైనా రెండు విడివిడిగా ఉంటాయి.

"మనం ఎటైనా బయటి కెడదాం, ఉక్కగా వుంద"న్నాడు దల్‌జిత్.

"నాకింకా నిద్ర వస్తోంది," అన్నాను.

"అలాగయితే నీవు పడుకో, నేను అలా గురుద్వార దాకా వెళ్ళొస్తాను."

"సరే, జాగ్రత్త. ఎక్కడేనా తప్పిపోయేవు!"

దల్‌జిత్ వెళ్ళాక, నేను మంచం మీద పడుకుని టాగూరు రాసిన ది గార్డినర్ పుస్తకం తీసాను చదువుదామని. కానీ ఆ సాయంత్రపు నీరెండలో ఏవేవో పురుగులు చల్లగాలికి బయటకు రాసాగాయి.

తెల్లచీమలు, చెద పురుగులు ఎండ వేడికి కిందెక్కడో దాక్కున్నాయి కాబోలు, ఒక్కసారిగా బయటకు వచ్చాయి. చిన్న చిన్న రంధ్రాల నుండి, గోడ సందుల్నించి రెక్కలున్న చీమలు బయట పడ్డాయి. టపా, టపా రెక్కలు కొట్టుకుని తమ జన్మకదే చివరిసారి అన్నట్టుగా వెలుతురు వైపుకు ఎగరసాగాయి. గదిలోని ఎలక్ట్రిక్ బల్బ్, వీధి దీపాలు, రోడ్డు మీది కిరోసిన్ దీపాలు వాటి గమ్యాలు. మా హొటలు కిటికీ పక్కగా ఉన్న వీధి దీపం కింద దట్టంగా, నల్లగా కమ్ముకున్నాయి పురుగులు.

ఆ తరవాత బల్లివంతు. బల్లులు తమ గులాబీరంగు నాలుకల్ని బయటకి

చాపి దొరికిన పురుగునల్లా తిని పండగ చేసుకుంటున్నాయి. మళ్ళీ ఎప్పటికి దొరుకుతుందో నన్నట్టుగా ఆత్రంగా, దొరికినన్ని పురుగుల్ని పొట్టలో కుక్కుకుంటున్నాయి. ఎండాకాలమంతా లోపలుండి స్వతంత్రంగా రెక్కలల్లార్చుకుంటూ బయటకొచ్చిన ఒక్క పురుగూ బ్రతికి బట్టకట్టదు.

నేను మత్తుగా కళ్ళు మూసుకున్నాను. కానీ కిటికీ నుండి బయట వీధినుండి ట్రాఫిక్ చప్పుళ్ళు వినిపిస్తూనే వుంది. దూరంగా రేవులో ఓడలు, ఇంకా దూరంగా కొండలు కనిపిస్తున్నాయి.

అలా కళ్ళు మూసుకుంటే నిద్ర పట్టేసింది. దల్‌జిత్ వచ్చాకే మెలకువ వచ్చింది.

"మన సమస్య తీరిపోయింది. ఇక రైలు అదీ ఏమీ అక్కర్లేదు. నేను ఒక ట్రక్‌డ్రైవర్ని మంచి చేసుకున్నాను. అతను మనల్ని జైపూరు దాకా తీసికెళ్తానన్నాడు. అంటే మూడు వందల మైళ్ళు! మనం అక్కడనుండీ రైలెక్కి వెళ్ళి పోవచ్చు."

"మీ ఫ్రెండ్ మనెల్పెప్పుడు తీసికెళ్తాడు?"

"రేపు ఉదయం నాలుగింటికి ట్రక్కు బయలుతేరుతుందని చెప్పాడు."

"దుష్టజీవాలకు సుఖం వుండదుట! సరే, తొందరగా వెడదాం. ఈరోజు బుధవారం. మా చిన్నాన ఓడ శనివారం బయలుదేరుతుంది అనుకుంటాను. మనం ఎంత డబ్బివ్వాలి?"

"ఏమీ యివ్వక్కర్లేదు. ఉచితంగానే తీసుకెళ్తాడు. ఆ డ్రైవరు మా సిక్కువాడేలే! మా వదిన, అతని బావమరిదికి దూరపు చుట్టం అని చెప్పి ఒప్పించాను."

## ముమ్టా వెళ్ళే దారిలో

మరునటి రోజు ఉదయం నాలుగు గంటలకు మేము లేచి రెడ్‌ఫోర్టు (ఎర్రకోట) వైపు నడక సాగించాము. క్రితం సాయంత్రం మనుషులతో కిటకిటలాడి పోతున్న రెడ్‌ఫోర్టు నిర్మానుష్యంగా వుంది. నల్లటి ఆకాశంలో ఇంకా నక్షత్రాలు మెరుస్తున్నాయి. వీధిదీపాలు పేవ్‌మెంట్ల మీద వెలుతురు మడుగుల్ని చిమ్ముతున్నాయి. అక్కడో కారూ, ఇక్కడో కారు-అదేదో వేరే ప్రపంచంలా ఉంది.

ఫోర్ట్ దగ్గర ఒకటి రెండు దాభాలు తెరిచేవున్నాయి. పొద్దున్నంతా పడుకుని, రాత్రిళ్ళు డ్రైవ్ చేసే డ్రైవర్లు వాళ్ళ దగ్గరకు ఎక్కువగా ఎక్కువగా వస్తుంటారు.

మా డ్రైవర్, పొడుగ్గా, పెద్ద గడ్డంతో మా వైపుగా చీకట్లో నడిచి వచ్చాడు. అతనితో బాటు మరో సిక్కు అతను, ఇంకా అండర్‌వేర్‌లోనే ఉన్నాడు.

"మీరు ట్రక్ వెనుక ఎక్కండి. ఇంకొన్ని నిమిషాల్లో బయలుదేరుదాం," అని పంజాబీలో చెప్పాడు. కానీ నాకు అర్థం అయింది.

ఆ ట్రక్ పక్కనే వున్న పెద్ద రావిచెట్టు కింద పార్క్ చేయబడింది. మేము అక్కడికి వెళ్ళి ట్రక్‌లో ఎక్కబోయేంతలో ఒక పురాతనమైన మృగం ఒకటి మమ్మల్ని అటకాయించింది./ అది మమ్మల్ని చూసి అరచి, బయటికి తోసినంత పనిచేసింది.

"భయ్యాజీ, ఇక్కడేదో మృగం ఉంది," అని అరిచి చెప్పాడు దల్‌జిత్.

"భయపడకు. అది ముమ్తా అంతే"

"అదిక్కడేం చేస్తోంది?"

"అది మనతోనే జయ్‌పూర్‌కు వస్తుంది. మీరు ఎక్కి కూచోండి. అదేం చేయదు."

అప్పటికి కొంచెం వెలుతురు వచ్చింది. మాతో ప్రయాణం చేసే ముమ్తా బాగా బలిసిన పంజాబీ గేదె.

"మంచి జాతి గేదె. కళ్ళు చూడు ఎలా నీలంగా ఉన్నాయో!" అన్నాడు దల్‌జిత్. అతనికి ఈ విషయాలన్నీ బాగా తెలుసు.

"గేదెలకు నీలి కళ్ళుంటాయన్న విషయం నేనెప్పుడూ వినలేదు" అన్నాను. "మంచి పంజాబీ గేదెలకు నీలి కళ్ళుంటాయి. అవి బ్రౌన్ రంగు కళ్ళున్న గేదెలకన్నా ఎక్కువ పాలిస్తాయి."

మా అదృష్టం కొద్దీ సర్దార్జీ త్వరగా వచ్చి ట్రక్కును బయల్దేర దీసాడు. తెల్లవారు జాము చల్లని గాలి, గేదె వాసనను తగ్గించింది. మేము ఢిల్లీ దాటి జయ్‌పూర్ దారిన పడ్డాము. క్రితం రోజు కురిసిన వర్షానికి ఏర్పడ్డ గుంటల్లో నీళ్ళు నిలిచి అక్కడ నీటి పక్షులు, కొంగలు, బాతులు కనిపిస్తున్నాయి. పొలాల్లో చెట్ల మీద పేరు తెలియని వింత పక్షులు అందంగా ఆహ్లాదంగా అరుస్తున్నాయి. వడ్రంగి పిట్ట, రంగురంగుల ఈకలున్న పాలపిట్ట, పొడుగు తోక వున్న కింగ్‌క్రో, విష్ణు వాహనంగా చెప్పబడే గరుడ పక్షి-ఎన్నెన్నో పక్షులు కనిపించాయి.

రాజస్థాన్ దగ్గర పడేటప్పటికి నెమళ్ళు ఎక్కువగా కనిపించ సాగాయి. వాటితో బాటే రోడ్డు వారన హుందాగా నడిచే ఒంటెల వరుసలు కూడాను. పొలాలు తగ్గి, ఎడారి కనిపించసాగింది. అక్కడి ప్రజలంతా రంగుల రంగుల బట్టలు వేసుకుని, ప్రకృతిలో తక్కువైన రంగులు తమపైనే చూసుకోమనట్లుగా అనిపిస్తున్నారు. ఎర్రటి పరికిణీలు, బంగారు; వెండి నగలు వేసుకున్నారు ఆడవాళ్ళు. మగవాళ్ళు తెల్లగా, ధృడంగా పొడుగ్గా ఉన్నారు. వయస్సు మళ్ళిన వాళ్ళకు తెల్లటి పొడావాటి గడ్డం అందాన్నిచ్చేయి.

పొద్దు మళ్ళే కొద్దీ ఎండ ఎక్కువైంది. వీధిలో ట్రాఫిక్ పెరిగింది. కానీ మా

ట్రక్ డ్రైవరు స్పీడు తగ్గించకుండా ఇంకా పెంచాడు. ముందున్న ట్రక్కును ఓవర్‌టేక్ చేయాలనీ కొన్నిసార్లు మరీ వేగంగా వెళ్ళేవాడు. బహుశా ట్రక్కులోని గేదెను త్వరగా బజార్లో అమ్మేయాలను కుంటున్నాడు కాబోలు.

మా ముందున్న ట్రక్కు కూడా స్పీడుగా వెళ్తోంది. దాని డ్రైవరుకి, మాకు దారి యిచ్చే ఉద్దేశ్యం ఉన్నట్లు లేదు. దారిలో మధ్యగా పోనిస్తున్నాడు. ట్రక్కు నిండా చెరకు గెడలు పేర్చివున్నాయి.

"వీళ్ళిద్దరికీ పందెం పడినట్టుంది, చూడు" అని వీధి సరిగ్గా కన్పించాలని గేదెకు ఎదురుగా ఆనుకుని నిలబడ్డాడు.

ఆ రోడ్డు రెండు ట్రక్కులు పట్టేంత వెడల్పుగా లేదు. మా ముందున్న ట్రక్కువాడు దారి యివ్వలేదు కాబట్టి, పక్కనున్న మట్టిరోడ్డు మీదుగా మాట్రక్కు వెళ్ళవలసి వచ్చింది. మట్టి ధూళిగా లేచి మమ్మల్ని ఉక్కిరి బిక్కిరి చేసింది. మేము నిలదొక్కుకోలేక ట్రక్ బోర్డు మీద పడ్డాము. గేదె భయంతో మమ్మల్ని తొక్కినంతా పని చేసింది ఒకచోట బ్రేకు వేసేటప్పటికి, పెద్దగా కుదుపు వచ్చి ట్రక్కు ఆగింది

ధూళి పొర తగ్గాక మా గెడ్డం డ్రైవరు తల బయటికి పెట్టి మమ్మల్ని పిలిచాడు, ఆత్రంగా–

"మీకేం కాలేదు కదా?"

"ఏం లేదు. బాగానే ఉన్నాము" అని జవాబిచ్చాను.

"మీరు ఆ ట్రక్కును ఓవర్‌టేక్ చేసారా?" దల్‌జిత్ అడిగాడు.

"లేదు. వాడు దారి యివ్వలేదు. వాడు కూడా సిక్కువాడే! మీరు ముందుకు రారాదూ?"

మేము మరో ఆలోచన లేకుండా సరేనన్నాము. అతని అసిస్టెంట్ గొణుక్కుంటూ గేదె దగ్గరికి వచ్చాడు.

కొంచెం దూరం వెళ్ళాక, మాటల్లో డ్రైవరు తన పేరు గుర్నామ్‌సింగ్ అని చెప్పాడు.

"మా ట్రక్ హారన్ ఎలా ఉందో చూస్తారా?" అని అడిగాడు పంజాబీలో.

"ఇంతసేపూ వింటూనే వున్నాము కదా?" అన్నాను నేను హిందీలో.

"మీకు వెనుక నుండి సరిగ్గా వినిపించదు. ఇప్పుడు వినండి" అని గట్టిగా మోగించాడు. ఆ శబ్దం ట్రక్కంతా నిండిపోయింది.

"చాలా బాగుంది. ఏ హారనూ ఇంతకంటే గట్టిగా మోగదు" అన్నాను చెవిలో పెట్టిన వేళ్ళు తీయకుండా.

"ఇది అరమైలు దూరంలో కూడా వినిస్తుంది," అని గర్వంగా అంటూ మరోసారి గట్టిగా మోగించాడు. దారిలో సైకిలు మీద పోతున్న యిద్దరు కుర్రాళ్ళు భయంతో ఉలిక్కిపడి దారి తప్పుకున్నారు.

"ఇక్కడ కూడా చాలా గట్టిగా వినిపిస్తుంది" అన్నాను నేను మెల్లగా. అతనేమైనా అనుకుంటాడేమో నని...

"మీ హారన్‌లో రెండు రకాల శబ్దాలున్నాయి కదా?" దల్‌జీత్ అన్నాడు.

దీనికి గుర్నామ్ సింగ్ నొచ్చుకుంటాడేమో అనుకున్నాను. కానీ దానికి బదులుగా సంతోషించాడు.

"అవును, రెండు! అదా-మొగా-చూడండి" అని మళ్ళీ మోగించి చూపించాడు. ఒకటి పెద్దగా, మరొకటి మెల్లగా వినిపించింది. రెండూ చెవులు చెల్లులు పడేటట్టుగానే ఉన్నాయి. మా ముందు నడుస్తున్న ఒంటె ఒకటి బెదిరి పొలాల్లోకి పారిపోయింది.

"నేను దీన్ని నా ట్రక్ కోసం స్పెషల్‌గా చేయించాను. నాకు ఫారిన్ హారన్‌లంటే గిట్టవు. అంత పెద్దగా మోగదు అది. ఇండియన్ హారన్‌లే మంచివి!" అన్నాడు గుర్నామ్‌సింగ్. "ఇక్కడే పాత ఢిల్లీలోనే తయారు చేయించుకున్నాను. నేనే నాకెలా కావాలో చెప్పి చేయించుకున్నాను. డెభై అయిదు రూపాయలే. కానీ దీంట్లో ఒకటే మెలిక వుంది-తడితగిలితే పని చేయదు!"

మరల అతని చేయి హారన్ మోగించడానికి వస్తుంటే, వర్షం వస్తే బాగుంటుంది అనుకుని వర్షం కోసం ప్రార్థిస్తామనుకున్నాను. కానీ నిర్మలంగా వున్న ఆకాశాన్ని చూసి ప్రార్థన వృథా కాకూడదని ఊరుకున్నాను.

"ఇలాటి హారను నీవెక్కడా చూసుండవు. ఒక్కసారి మోగించి చూడు,

బాబూ, మోగించు" అని నన్ను చూస్తూ అన్నాడు. అతని పక్కన ఉన్నది నేనే. దల్ జిత్ కిటికీ దగ్గర కూర్చుని వున్నాడు.

"వద్దులెండి. మీరు మోగించి చూపించారు కదా. ఎంత బాగా వినిపిస్తుందో అని" అన్నాను మొహమాటంగా.

"అలాకాదు. నీ చేత్తే నీవే మోగించు, నే చెప్తున్నాను ప్రయత్నించు!" అన్నాడు. ఒక కొత్త ఆట సామానుని తమ్ముడితో పంచుకోవాలనే అన్నయ్య లాగా అనిపించాడు సింగ్.

నా చేతిని తన చేతిలోకి తీసుకుని హారను పైన పెట్టాడు. దాన్ని కొంచెం నొక్కగానే నాకూ సరదాగా అనిపించింది. ట్రక్ అంతా సంగీతం అలముకున్నట్టుగా అనిపించింది. నేను హారన్ అలా నొక్కుతుంటే డ్రైవర్ ఎందుకు అంత సంతోషిస్తున్నాడో అర్థమైంది. అటువంటి హారను వుండడం వల్ల రహదారికి తానే రాజైనంత సంతోషం కలిగి ఉంటుంది డ్రైవరుకి.



# జైపూర్ దాటాక బందిపోటు దొంగలు

మేము జయపూర్ చేరేటప్పటికి చీకటి పడింది. అందుకని ఊరు చూడలేక పోయాము. ఆ రాత్రి మేము గుర్నామ్‌సింగ్‌తో పాటు ట్రక్కులోనే పడుకున్నాము. సమ్మర్ అయినా జైపూర్‌లో అప్పుడు కొద్దిగా చలిగానే ఉంది. సింగ్ అతని పరుపు మాకిచ్చాడు. అతనికి ట్రక్‌లో పడుకోవడం బాగా అలవాటు కాబట్టి వెంటనే నిద్ర పట్టేసినట్టుంది. తాళబద్ధంగా గట్టిగా గురకపెట్టడం మొదలెట్టాడు. నేను, దల్‌జిత్ పక్కమీద దొర్లుతూ పడుకున్నాము. రాత్రి ఎన్నోసార్లు నిద్రలో నన్ను కాళ్ళతో తన్నాడు. కింద ఇంకా గేదె వాసన అలాగే వుంది.

మాకు బాగా నిద్ర పడుతున్నట్లనిపించే టైముకి గుర్నామ్ సింగ్ మమ్మల్ని తట్టి లేపాడు. తెల్లారిజామున నాలుగైందనీ, తాను ట్రక్కులో ఎర్రటి పలక రాళ్ళను ఎక్కించుకుని తిరిగి వెళ్ళాలనీ చెప్పి మమ్మల్ని దింపేసాడు.

"ఏం బతుకురా బాబూ, నేను జీవితంలో ఎప్పుడూ ట్రక్ డ్రైవర్‌గా పని చేయను" అన్నాడు దల్‌జిత్ కళ్ళు నులుముకుంటూ.

"ఎలాగోలా బతకాలి కదా" అన్నాడు తాత్త్వికంగా గుర్నామ్‌సింగ్. "అయినా నాకు డ్రైవింగ్ అంటే ఇష్టమే. నాకు ఆరేడేళ్ళ వయస్సప్పుడే డ్రైవింగ్ వచ్చేసింది. దీంట్లో సంపాదన కూడా బాగానే వుంది. ఇప్పుడు నేను ఢిల్లీకి వెళ్తే నాకు అక్కడ రెండు రోజుల పాటు విశ్రాంతి దొరుకుతుంది. నా పెళ్ళాం, పిల్లలతో గడుపుతాను. గుడ్‌బై, అబ్బాయిలూ మీరు మళ్ళీ

ఎప్పుడైనా ఢిల్లీ వస్తే రెడ్‌ఫోర్టు దగ్గరే కలుస్తాను"! అని చేతులు ఊపి, పెద్ద చప్పుడులో ట్రక్‌ను స్టార్ట్ చేసుకుంటూ వెళ్ళిపోయాడు. దారిలో కుక్కలు మొరుగుతున్నాయి, కాకులు కూస్తున్నాయి. తెల్లారిపోయిన సూచనగా.

మేము ఊరి బయట ఒక పెద్ద సరోవరం (లేక్) దగ్గర ఉన్నాము. దీనికి ఆవలి పక్కన మైదానం, కొండలు, ఎడారి వున్నట్టున్నాయి. బాబుల్ చెట్ల మధ్యన ఒక పాడు పడిన బిల్డింగ్, పాలెస్ లాంటిది వున్నట్టూ అనిపించింది.

"మనం అలా వెడదాం. లేక్‌లో స్నానం చేసి, కాస్సేపు విశ్రాంతి తీసుకుని తెల్లారాక సిటీకి రావచ్చు. రైళ్ళ గురించి కూడా కనుక్కోవచ్చు" అన్నాడు దల్‌జిత్.

మేము అలా లేక్ ఒడ్డునే నడుస్తూ వెళ్ళాము. మాకు అవతలి వైపుకు వెళ్ళడానికి అరగంట పట్టింది.

అక్కడ పొలాల్లో ఎవరూ లేరు. ఒక ఒంటె మాత్రం బావి చుట్టూ తిరుగుతూ, నీళ్ళు తోడిపోస్తోంది. దూరంగా పల్లెటూళ్ళో ఇళ్ళపైన వంట పొయ్యి నుండి పొగలు రావడం కనిపిస్తోంది. ఎక్కడో దూరంలో మురళీగానం గాలిలో నుంచి తేలివస్తోంది.

అక్కడ నుండి మాక్కనిపించిన బిల్డింగ్‌కి ఇంకా ఇరవై నిమిషాల నడక పడుతుంది. అది ఏ రాజపుత్రుల రాకుమారుడో వేట కోసం కట్టుకున్న ఇల్లు కావచ్చు. అప్పట్లో వేటాడడానికి ఎన్నో జంతువులు ఉండి ఉండొచ్చు.

ఆ ఇంటి గేటుకు అడ్డంగా ఒక రాళ్ళ గుట్ట వుంది. ఒక వైపు గోడ కూలిపోయి వుంది. వాటి మధ్య ఉన్న చిన్న సందు ద్వారా లోపలికి వెళ్తే రాళ్ళు పరచిన దారి కనిపించింది. దాని చివర పాడుపడిన ఒక ఫౌంటెన్ కనిపించింది. ఫౌంటెన్ పగులు లోంచి ఒక చిన్న రావిచెట్టు మొలుస్తోంది.

మేము ఆ ఇంటి ముఖ్యమైన భాగాన్ని దాటుకుంటూ లోపలికి వెళ్ళబోతోంటే దల్‌జిత్ ఆగిపోయి, రస్టీ, నీకేమైనా వాసన వస్తోందా? అని అడిగాడు.

"అవును. ఏదో కూర వాసన వస్తోంది" అని చెప్పాను.

ఈ శిథిలమైన భవనంలో ఎవరో ఉన్నారన్నమాట. మేము తిరిగి వెనక్కి

వెళ్ళిపోవాలా, ముందుకు వెళ్ళాలా అని ఒక్క నిముషం ఆలోచించాము. కానీ కుతూహలం మమ్మల్ని ముందుకు తోసింది. కూర వాసన వల్ల వచ్చిన కుతూహలం! నేను, దల్‌జిత్ ముందుకు వెళ్ళి అక్కడ గోడవారగా, నీడలో నిలబడ్డాము. ఆ గది తలుపు నుండి వెళ్తే చీకటిగా వున్న మరొక గది. అక్కడనుండే వాసన వస్తోంది.

"పద, ముందుకు" దల్‌జిత్ అన్నాడు.

"పద, నీకోసమే నిలబడ్డాను" అన్నాను నేను.

మేమిద్దరమూ ఆ గదిలోకి ఒక్కసారే అడుగు పెట్టాము. అక్కడెవరూ లేరు. గది ఖాళీగా వుంది.

ఆ గది మూలలో ఒక కుంపటి, దానిపైన ఒక గిన్నెలో ఏదో ఉడుకుతోంది. మంచి వాసన వేస్తోంది. కానీ వంట చేసే వాళ్ళెవరూ లేరు. నేను జాగ్రత్తగా అడుగులో అడుగు వేసుకుంటూ కుంపటి దగ్గరకెళ్ళి గిన్నెమీద మూతతీసి చూసాను. కోడి మాంసం కూర! కమ్మటి కోడి మాంసం కూర ఇలా పాడుబడిన బంగళాలోనా! ఇక్కడికెలా వచ్చింది అని మాకాశ్చర్యం వేసింది. చుట్టు పక్కలా గిన్నెలేవీ కనిపించలేదు. నేను చేత్తోటి ఒక మాంసపు ముక్కను తీసి, నోట్లో పెట్టుకుని కొరికేలోగా బలమైన రెండు చేతులు నన్ను పైకి ఎత్తాయి.

నేను భయంతో కోడి మాంసపు ముక్కను కింద పడేసాను. అతని చేతుల్లోంచి తప్పించుకోవాలని గింజుకున్నాను. కానీ అతనివి చాలా బలిష్టమైన చేతులు. ఆ చేతులు దెయ్యానివి కావు మనిషివేనని మాత్రం ఖచ్చితంగా చెప్పగలను, ఎందుకంటే ఆ చేతుల మీద వెంట్రుకలున్నాయి. నేను తప్పించుకోవాలని చేతులు కాళ్ళు కొట్టుకుంటుంటే నా ఎదురుగా ఇంకెవరో ఒకతను వచ్చి, కాళ్ళు పట్టేసుకున్నాడు. దల్‌జిత్‌ను కూడా ఎవరో పట్టుకున్నట్టు అతని కేకల వల్ల తెలిసింది. నేను గట్టిగా అరవబోతే నూనెతో తడిసిన గుడ్డ ముక్కను ఎవరో నా నోట్లో కుక్కారు. నా చేతులు పట్టుకుని, కాళ్ళను తాడుతో కట్టేసారు. ఆ తర్వాత నేల మీద ఎత్తి కుదేసారు. నేను బోర్లా పడ్డాను. దల్‌జిత్ కూడా ఇంచుమించు అదే స్థితిలోనే ఉన్నాడు. మేమిద్దరమూ నిస్సహాయంగా వుండిపోయాము. ఆ గదిలో వాళ్ళు ఐదుగురు

వున్నట్టున్నారు.

"అతను కుర్రాడే" అని వాళ్ళలో వాళ్ళు హిందీ యాసలో అనుకుంటున్నారు. కానీ నాకు వాళ్ళ మాటలు అర్థం అయ్యాయి. చీకట్లో అతని ముఖం సరిగ్గా కనిపించలేదు కానీ అతని గడ్డం నా పీకకి తగిలింది. అతని నోరు వెల్లుల్లి వాసన వేస్తోంది.

అబ్బాయైనా, అమ్మాయైనా మన తిండికి ఎసరు పెట్టే వాళ్ళకి తగిన శాస్తి చెయ్యవలసిందే అన్నాడు గెడ్డం లేనతను.

"ఇతను బలే తెల్లగా ఉన్నాడు" ఇది గెడ్డం వాడి గొంతు.

"విదేశీయుడా?"

"కాకపోవచ్చు. అటూ-ఇటూగా ఉన్నాడు. అలా పెరట్లోకి తీసుకురండి సరిగ్గా కనిపిస్తుంది."

"వద్దు. వీళ్ళు మనల్ని చూడకూడదు. మనం ఇక్కడున్నట్టుగా గ్రామస్థులకు తెలిసిపోతే ఈ స్థలాన్ని మళ్ళీ వాడలేము."

"అయితే, దీపం ముట్టించు."

కిరోసిన్ దీపం ముట్టించడానికి వెళ్ళినతను అక్కడ ఉన్నవాళ్ళలో పొడుగ్గా ఉన్నాడు.దీపం ముట్టించగానే గోడ మీద పెద్ద నీడ పడింది. అతను రాక్షసుడిలా, ఆరడుగుల కంటే ఎత్తుగా ఉన్నాడు. ఒంటి మీద చొక్కా లేదు. తల మీద వెంట్రుకలు సన్నగా కత్తిరించి వున్నాయి. అతని చేతి కండరాలు ఉక్కు ముక్కల్లాగా వున్నాయి. గెడ్డం వాడి వెనక నిలబడి పనులు పురమాయిస్తున్న వాడు నాకు కనిపించటం లేదు.

"ఇలా పైకి తిప్పు. సరిగ్గా చూడొచ్చు" అన్నాడు అతను.

రాక్షసుడు నన్ను తిప్పాడు. నేను నిస్సహాయంగా మసిబారిన కప్పును చూస్తూ వుండి పోయాను. కొన్ని నిమిషాల తర్వాత మూడు ముఖాలు నన్ను పరీక్షగా చూస్తున్నాయి. చిమ్మచీకటిగా వున్న ఆ గదిలో, కాళ్ళూ చేతులూ కట్టేసిన నేను భయంతో బిక్కుబిక్కుమంటూ పడి వున్నాను. వాళ్ళను చూస్తే నేరస్థుల్లా (క్రిమినల్స్) వున్నారు. బహుశా ఈ పాడుపడిన ఇంటిని వాళ్ళు దాక్కోడానికి వాడుకుంటారేమో!

ఆ గెడ్డం వున్నతనికి చిన్న కోలకళ్ళు, కండరాలు బిగుసుకున్న ముఖం ఉంది. పెద్ద చప్పిడి ముక్కు, లావుపాగి పెదవులూ వున్నా, ముఖం క్రూరంగా లేదు. నన్ను మూడోవాడు చాలా భయ పెట్టాడు. ఇప్పుడు అతను పొడుగ్గా అనిపించటం లేదు, క్రూరంగా లేడు. అతను నన్ను చూసి నవ్వుతున్నాడు, కానీ అతని నవ్వు కూడా నాలో భయాన్నే కలిగించింది.

"నువ్వు అలా చికెన్ కూరను దొంగిలించడం ఏమీ బాగా లేదు. అర్ధరాత్రి బాంబిరీ కూడా అలాగే ప్రయత్నించాడు" అన్నాడు మృదువుగా.

"అవును. సరిగ్గా అర్ధరాత్రే"-బాంబిరీ అన్నాడు. బాంబిరీ అంటే తిరుగుతున్న బొంగరం. నన్ను మూడు కుక్కలూ, సగం పల్లెటూరి జనాభా తరుముకొస్తోంది. కానీ తప్పించుకుని పారిపోయి వచ్చాను అన్నాడు తనలో తనే నవ్వుకుని మురిసిపోతూ.

"సరే, కోడిమాంసం సంగతి ముఖ్యం కాదు. వాళ్ళు ఇప్పుడిక్కడికి ఎందుకు వచ్చారో కనుక్కో," అన్నాడు గడ్డంవాడు.

"ఇతన్ని అడుగుదాం" అని పొట్టిగా, భయంకరంగా వున్నతను నా మీదకు వంగి నా కళ్ళల్లోకి చూస్తూ, నా నోట్లో కుక్కిన గుడ్డను లాగేసాడు. గుడ్డ తీసేయగానే నా నోట్లో పంటికి ఏదో చల్లగా, గట్టిగా తగిలింది. పళ్ళ డాక్టరు దగ్గరికి వెళ్ళినపుడు ఇలాగే ఏదో చేసినట్టు గుర్తు. కానీ ఇతను నా నోట్లో పెట్టింది కత్తి.

"మేము చెప్పే వరకూ మాట్లాడం కానీ, అరవడం కానీ చేయకు," అని "సరిగ్గా కూర్చోపెట్టండి" అని కూడా చెప్పాడు.

నేను తలూపాను. బాంబిరీ ముందుకు వచ్చి నన్ను అక్కడున్న గోడ నానుకని కూర్చోపెట్టాడు.

"నా ముంజేతులు నెప్పి వేస్తున్నాయి" అన్నాను.

బాంబిరీ తాళ్ళను ఊడదీయాలను కున్నాడేమో, ముందుకు వంగాడు. కానీ వాళ్ళ లీడరు-"చేతి కట్లు విప్పకు, మూర్ఖుడా" అని అరిచాడు.

"ఇప్పుడు చెప్పు, మీరు ఇక్కడ ఏం చేస్తున్నారు?"

"మేము ఎక్కడేనా విశ్రాంతి తీసుకోవాలని చూస్తున్నాము" అన్నాను.

"అతని చేతుల్ని మెలిపెట్టు బాంబరీ."

బాంబరీ అంత గట్టిగా మెలిపెట్టలేదు. అతను పహిల్వాను కామోను ముట్టుకోగానే నాకు కళ్ళలో నీళ్ళు వచ్చినాయి.

"అబద్ధాలు చెప్పకు. అబద్ధాలు చెప్పటం చాలా కష్టం. మీరు మాపైన నిఘా వేసారు కదూ?" అన్నాడు నాయకుడు.

"మాకు మిమ్మల్ని గురించి ఏమీ తెలియదు. మేము నిన్న రాత్రే జైపూర్‌కు వచ్చాము" అన్నాను.

"వీళ్ళను చూస్తే గూఢచారుల్లా లేరు. కుర్రాళ్ళు"-అన్నాడు గడ్డంవాడు.

"మేము సముద్ర తీరం వరకు పోవాలి. మాదగ్గర డబ్బు లేదు," అన్నాను.

"అయితే మీరు మా తిండి దొంగిలించడానికే వచ్చారన్న మాట." తిండిని పోగొట్టుకున్న విచారం, మేము గూఢచారులమన్న భయం కంటే ఎక్కువగా కనిపిస్తుందతనిలో.

"వీళ్ళ దగ్గర డబ్బేమైనా వుందేమో చూద్దాం అని నా జేబులు సోదాచేసి కొని నోట్లూ, కొంచెం చిల్లరా బయటకు తీసారు. తర్వాత దల్‌జిత్ దగ్గరకు వెళ్ళి వాడి పర్సులోంచి డబ్బు తీసారు. దీంట్లో ముఫైయ్యో, నలభైయ్యో వున్నట్టుంది" అనుకుంటూ అంతా తన జేబులో కుక్కుకున్నాడు.

"వీళ్ళను వదిలేద్దామా?" బాంబిరీ అడిగాడు.

"ఒద్దు. వీళ్ళు అరిస్తే అందరికీ మన ఉనికి తెలిసిపోతుంది. మనం ముందు తిండితిని ఇక్కడి నుంచి పారిపోదాం."

దొంగలందరూ శుభ్రంగా కూర్చుని, పదిహేను నిమిషాల పాటు భోజనం తినేశారు. ఒక్కముక్క కూడా మాకు మిగల్చలేదు. చేతివేళ్ళూ, పళ్ళాలతో సహా బాగా నాకి మరీ తిన్నారు. తిని తృప్తిగా తేన్చారు. బాంబిరీ తేన్పు పొట్టలోంచి, గొంతులోకి తన్నుకొచ్చి గాలిలో తేలి, గదిగోడకు తగిలి గంటలా మోగినట్టనిపించింది. పొట్టివాడు మాత్రం గమ్మత్తుగా త్రేన్చాడు.

"వీళ్ళనిక్కడే వదిలి మనం వెళ్ళి పోదాం. కావలసినంత విశ్రాంతి

తీసుకోపీ. రెండు మూడు రోజాలు పీళ్ళిక్కడున్నట్టుగా కూడా ఎవరికీ తెలీదు. ఆ తెల్లకుర్రాడి మూతిని కట్టెయ్యి బాంబిరీ" అన్నాడు వాళ్ళ లీడరు.

లాంతరు దీపం ఆర్పేస్తూ అతను నా మీదకు వంగినపుడు అతని కళ్ళలో నా పట్ల జాలి కన్పించినట్లయింది. అతను నా మీదకు వంగి, నోట్లో గుడ్డ కుక్కి, నా చేతులకు కట్టిన తాళ్ళను వదులు చేసాడు ఎవరు చూడకుండా.

"పదండి, పోదాం" అన్నాడు.

లీడరు ముందు నడిస్తే మిగిలిన వాళ్ళు అతని వెనక నడిచారు. బాంబిరీ అందరికంటే చివర వెళ్ళాడు కానీ, తిరిగి మమ్మల్ని చూడలేదు. వాళ్ళ అడుగుల చప్పుడు వినిపించనంత దూరం వెళ్ళి పోయాక బాంబిరీ వదులు చేసిన తాళ్ళను విప్పుకుని, నోట్లోని గుడ్డను పీకేసి పాక్కుంటూ దల్‌జిత్ దగ్గరకు వెళ్ళాను. అతని నోటికి కట్టిన గుడ్డను విప్పి, తాళ్ళను విప్ప దీసాను.

"నీ తాళ్ళెలా విప్పుకున్నావు?" దల్‌జిత్ మాట్లాడిన మొదటిసారి అడిగిన ప్రశ్న అదే!

"గట్టిగా మాట్లాడకు. తిరిగి వస్తారేమో! వాళ్ళు వండుకున్న గిన్నెలూ అవీ ఇక్కడే పడున్నాయి. ఇవీ వాళ్ళవి కాకపోవచ్చు" అన్నాను.

"కానీ నీ తాళ్ళెలా విప్పుకున్నావు, రస్టీ."

"ఆ పెద్దగా, లావుగా వున్నతను ఎవరూ చూడనప్పుడు తాళ్ళను వదులు చేసాడు. బహుశా అతనికి మనల్ని చూస్తే జాలి కలిగింది.కాబోలు."

"దేవుడు అతనికి మేలు చేస్తాడు. లేకపోతే మనం ఆకలితోనో, దాహం తోనో చచ్చిపోయే వాళ్ళం" దల్‌జిత్ అన్నాడు.

దల్‌జిత్ చేతులు కాళ్ళను విదిలించి, మోకాలిని ముడిచి గెడ్డం దాకా రానిచ్చి కాస్త ఎక్సర్‌సైజు చేసాడు. తరువాత నాకేసి ఆత్రంగా చూసి- "ఇప్పుడేం చేద్దాం రస్టీ? వాళ్ళు మన డబ్బు కూడా తీసేసుకున్నారు. ముందుకీ వెళ్ళలేము, వెనక్కీ వెళ్ళలేము. మనం ఇక్కడెక్కడున్నా దగ్గరగా ఉన్న పోలీసు స్టేషన్లో వెళ్ళి లొంగిపోదాము."

"మన 'హారర్ సాక్స్' కూడా పట్టుకెళ్ళారు. వాళ్ళు దొంగలు కదా, అదే వృత్తి వాళ్ళకు. పోన్లే, మనల్ని చంపకుండా వదిలేసారు కదా? మన

అదృష్టం!"

దల్‌జిత్ ఆలోచిస్తున్నాడు... అంతలో అతనికి ఒక మంచి ఆలోచన వచ్చినట్టుగా ముఖం వెలిగింది. "రస్టీ, వీళ్ళు అంత తెలివైన వాళ్ళు కారు. నా చేతి వాచీ, జేబులో వున్న చిల్లరా అలా వదిలేసారు."

"అయితే మంచిదే, మనం ఆకలితో మాడిపోనక్కర లేదు. వాచీ అమ్మేసెయ్యొచ్చు. కానీ దాన్ని అమ్మకుండా, అలాగే జామ్‌నగర్ చేరగలిగితే బాగుణ్ణు... దాన్ని మనం ఏదైనా ఎమర్జన్సీ వచ్చినపుడు అమ్మాలి."

"ఇది ఎమర్జన్సీ కాదా?"

"అవుననుకో...కానీ..."

"అలా అయితే మనం జామ్‌నగర్ వెళ్ళగలమంటావా? నువ్వింక ఆ విషయం వదిలేసుకుంటావేమో అనుకున్నాను."

"మరి నువ్వో?"

"నేను నీకంటే ముందే ఢీలా పడిపోతానని ఎలా అనుకున్నావు? పద ముందు ఇక్కణ్ణుంచీ బయట పడదాము. రేపే శనివారం. మనం ఓడ ఎక్కవలసిన రోజు" అన్నాడు దల్‌జిత్.



# వస్త్రాపహరణం

నేను దల్‌జిత్ స్టేషనులో ఒక గూడ్స్ వాన్ పైన ఎక్కి పడుకున్నాము. పైకప్పు ఆకాశమే! అది మెల్లగా కదులుతూంటే గాలికి ఎడారి ఇసక మా మీదంతా వచ్చి పడుతోంది. జుట్టు మీదా, కళ్ళలో, నోటిలో అంతా ఇసకే. దాన్నుండి తప్పించుకునే దారే లేదు. దల్‌జిత్ మొహం నిండా ఇసక పేరుకుపోయి, నారంగు అతని రంగూ ఒకటేలా కన్పిస్తోంది. ఎండ బాగా కాస్తోంది. మూలలో ఒక చిన్న చోట మట్టుకు కొద్దిగా నీడ వుంది. మా దగ్గర మిగిలిన డబ్బులతో కొనుక్కున్న అరటి పళ్ళు అప్పుడొకటి, ఇప్పుడొకటి తింటూ కూర్చున్నాము.

"రేపు ఉదయానికల్లా మనకి ఇంకా ఆకలి ఎక్కువ అవుతుంది. కొన్ని అరటి పళ్ళు దాచుకోవాలి" అన్నాను.

"రేపు ఉదయం మాట రేపటికే. నాకిప్పుడే ఆకలి గా ఉంది. అయినా మనం రేపటికల్లా జామ్‌నగర్ వెళ్ళిపోతాము కదా?" అన్నాడు దల్‌జిత్.

"కానీ అప్పటికే ఓడ బయలుదేరి వుంటే?"

"లేదు. అక్కడే వుంటుంది."

" నీకెలా తెలుసు?"

"నాకు తెలీదు కానీ, నేను ఆశావాదిని."

"ఇప్పటికే వెళ్ళిపోయి వుండవచ్చు. దల్‌జిత్ మన దగ్గర డబ్బు కూడా లేదు. ఏం చేద్దాం ఇప్పుడు?"

"ఊరికే భయపడి, 'హోకీగా ఆలోచించకు రష్టీ మరీ అంతగా ముంచుకొస్తే, నా గానీ అమ్మేసి స్కూలుకి తిరిగి వెళ్ళి పోదాము. ఏం చేస్తారు? మహా అయితే స్కూలు నుండి తీసేస్తారు. నన్ను తీయరులే. మా నాన్నగారి డబ్బుందిగా... కావలిస్తే మనం మళ్ళీ పారిపోవచ్చు."

"ఓడ వెళ్ళకుండా వుంటే బావుణ్ణు," అన్నాను.

"తప్పకుండా వుండే వుంటుంది. మనం రేపు దాంట్లో ఎక్కి వెళ్ళబోతున్నాం.నీవు మొంబాసా వచ్చి నాతో కొన్ని రోజులు ఉంటావు కదూ?"

"ఏమో, కుదురుతుందో లేదో! మా మామయ్య తో ఎన్నో చోట్లకి వెళ్ళవలసి వుంటుంది."

"అబ్బ, ఎంత బాగుంటుంది! ఇక అసలు స్కూలుండదు. రష్టీ, నేను కూడా నీతో వచ్చేస్తాను. బిసినెస్ అంత ఆసక్తికరంగా వుండకపోవచ్చు."

"మనం ఇద్దరం కలిసి ప్రపంచమంతా చూడొచ్చు. మన కలలు ఎంత అద్భుతంగా వున్నాయో!" అన్నాను.

"సరే, బయలుదేరాము కదా! మా తాతాగారు చెప్పేవారు (దల్ జిత్ తాతగారు పంజాబులో తయారైన బట్టల్ని అమ్ముతూ దేశమంతా తిరిగాడుట) మన ఊరు నుండి ఇంకొక ఊరికి వెళ్ళేటప్పుడు మధ్యలో కనిపించేదే నిజమైన దేశం అని."

"కానీ మీ తాతగారు బట్టల వ్యాపారం చేసేవారు కదా? మనలాగా కలలు కంటూ తిరగలేదు."

"ఏవిటి రష్టీ, నీకు తిరిగి వెళ్ళిపోవాలని వుందా?"

"లేదు."

కానీ ఆ రాత్రి ప్రయాణం చాలా కష్టంగా అనిపించింది. రైలు చాలా నెమ్మదిగా, అన్ని చోట్లా ఆగుతూ ప్రయాణం చేసింది. ఏదో ఒక చిన్న స్టేషన్లో పశువుల మేతను నింపిన సంచులు వాగన్లోకి విసిరేసారు. కానీ అవి మెత్తగా ఉన్నందువల్ల, మేము వాటిపైన సుఖంగా తెల్లారేదాకా పడుకున్నాము.

తెల్లారేటప్పటికి మా గమ్యం దగ్గర కొచ్చేసిందని మాకు తెలిసింది.

ఎడారి అంతా వెనకబడి, మా చుట్టూ మళ్ళీ పొలాలూ, చెట్లూ కనిపించాయి. పొడవాటి ఈత చెట్లు స్థానంలో, సముద్రం కనిపించింది. నేను నా జన్మలో మొదటిసారి సముద్రం చూసాను.

సముద్రం అచ్చంగా నేను అనుకున్నట్లే వుంది. ఆకాశమంత నీలంగా, పెద్దగా, ఏకాంతంగా! ఓడలు తేలుతున్నాయి దానిపైన. చల్లటి గాలి తీరం మీదకి వీస్తోంది.

మా రైలు అక్కడ దగ్గరగా వున్న ఒక బ్రిడ్జ్ పక్కన ఆగింది. మేము దిగి, బ్రేక్‌వాన్ డ్రైవరుకి, మమ్మల్ని ఎక్కించుకున్నందుకు కృతజ్ఞతగా చేయివూపాము. గూడ్స్‌రైలు ముందుకు వెళ్ళే వరకూ, ఆ బ్రిడ్జి కింద దాక్కున్నాము, గార్డు కంటబడకుండా.

అటూఇటూ చూసి, ఎవరూ లేరని నిర్ధారించుకుని, మురికిగా వున్న మా బట్టలు విప్పేసి నీటిలో దిగాము. నీరు అంత చల్లగా లేదు. మా డెహరాడూన్ కొండవాగుల్లాంటి ఫ్రెష్ నీళ్ళు కాదు కానీ మాకు అప్పటికి బాగానే అనిపించింది. నీటిలోని తామర తంపరను పక్కకు తప్పించి అటూఇటూ తిరిగాము. అలసిపోయిన మా శరీరాలకు ఎంతో హాయిగా అనిపించింది. ఒకళ్ళపైన ఒకళ్ళం నీళ్ళు చల్లుకుని ఆనందించాము. దల్‌జిత్ ఒక్కసారి మునిగి తేలేసరికి అతని తల మీద ఒక తామర కాడ జుట్టుకు తగులుకుంది.

అలా ఒక పదిహేను నిమిషాల నీటిలో ఉన్నాక, గట్టు మీదికొచ్చి చూస్తే, అక్కడ దల్‌జిత్ తలపాగా ఒక్కటే వుంది. మా బట్టల్ని ఎవరో ఎత్తుకెళ్ళారు.

దూరంగా గోచీ పెట్టుకున్న ముగ్గురు పిల్లలు కనిపించారు. వారిలో కొంచెం పెద్ద పిల్లాడి చేతిలో మా బట్టలున్నాయి.

"దయచేసి మా బట్టలు మాకు ఇచ్చేయండి. నా టర్బన్ ఒకటే వదిలేరు. కానీ నేను దానిని తలకే పెట్టుకోగలను" అని హిందీలో బతిమాలుతున్నట్టుగా అడిగాడు దల్‌జిత్.

ఆ ముగ్గురు పిల్లలూ మమ్మల్ని చూసి పెద్దగా నవ్వుకుంటూ పొలాలకు అడ్డంగా పడి పరిగెత్తుకుని వెళ్ళిపోయారు.

"అబ్బాయిలూ, రండి, ప్లీజ్..." దల్‌జిత్ అరిచాడు.

"మనం వాళ్ళ వెంట పడదామా?" అని అడిగాను.

అది మాకు జీవన్మరణ సమస్యలాగా అనిపించింది. దల్‌జిత్ ఒంటిపైన వాచ్, టర్బన్ తప్ప మరేం లేవు. నాకు అవీ లేవు. మేము ఒడ్డు పైకి వచ్చి, ఆ పల్లెటూరి అబ్బాయిలు వెంటపడ్డాము. వాళ్ళు మాకంటే బాగా ముందున్నారు. వాళ్ళకు తెలిసిన దారి కాబట్టి సులువుగా పరిగెత్తుకుని ఊళ్ళోకి వెళ్ళిపోయారు. మేమింకా పొలాల్లోనే ఉన్నాము.

నేను కొంచెం ఆగి నోటికి చేతులు కప్పులా పెట్టుకుని గట్టిగా అరిచాను, "దయచేసి మా బట్టలు మాకు తిరిగి ఇచ్చేయండి. మా దగ్గర ఇంకేమీ లేవు" అని నాకు తెలిసిన మంచి హిందీలో గట్టిగా అన్నాను.

దానికి జవాబుగా నా చెవి పక్కనుండి ఒక చిన్న రాయి దూసుకుపోయింది.

"వీళ్ళకు హిందీ వచ్చినట్లుగా లేదు. ఇంగ్లీషులో ప్రయత్నం చేయనా?" అని అడిగాను.

"ఒద్దు. ఇంకొన్ని రాళ్ళు పడొచ్చు. గుజరాతీ వస్తుందేమో..."

అంతలో ఎవరో అతను పొలం గట్టు అంచున కనిపించాడు. చేతిలో ఒక కర్ర పట్టుకుని మాకు అర్థం కాని భాషలో ఏదో అంటున్నాడు.

"అతనేమంటున్నాడు?" అన్నాడు దల్‌జిత్.

"నాకెలా తెలుస్తుంది. మనల్ని అతని దారిలోంచి తప్పుకోమంటున్నాడేమో!"

"కానీ, మన బట్టలు లేకుండా ఎలా వెళ్తాము?"

"నిజమే. మన బట్టలు తీసుకునే వెళ్ళాలి."

అంతలో కొన్ని వీధి కుక్కలు చూసి మొరగడం మొదలెట్టాయి, "హౌండ్ ఆఫ్, బాస్కర్ విల్లీస్" నవలలోలాగా. వాటి వెంట కర్రలు పట్టుకుని ఇద్దరు మనుషులు, రాళ్ళు రువ్విన పిల్లలు వున్నారు. మేమిద్దరం వాళ్ళను చూసి పరుగు లంకించుకున్నాము. అలసిన మా కాళ్ళు ఎంత త్వరగా పరిగెత్తగలవో అంత త్వరగానూ పరిగెత్తాము. కొన్త దూరం వెళ్ళి తిరిగి చూస్తే వాళ్ళు ఆగిపోయింది కనిపించింది. వాళ్ళను చూసి చేతులు తిప్పి, వెక్కిరించి పక్కనే ఉన్న మామిడి తోపులో చేరాము.

"ఇప్పుడేం చేద్దాం?" అన్నాడు దల్‌జిత్.

ఆగిపోయింది కనిపించింది. వాళ్ళను చూసి చేతులు తిప్పి, వెక్కిరించి పక్కనే ఉన్న మామిడి తోపులో చేరాము.

"ఇప్పుడేం చేద్దాం?" అన్నాడు దల్‌జిత్.

"జామ్‌నగర్‌కి కాలినడకనే వెళ్ళిపోవాలి. అట్టే దూరం వుండకపోవచ్చు."

"ఇలాగే, బట్టల్లేకుండానే?"

"ఇలాగే, ఏం చేద్దాం. చీకటి పడితే ఎవరికీ కనిపించదులే."

"తెల్లారితే?"

"అప్పుడు చూద్దాంలే. అంతగా అయితే వాచీ అమ్మేసి బట్టలు కొందాం."

"మనం ఒంటి మీద ఏమీ లేకుండా చేతి మీద వాచీ ఒక్కటే పెట్టుకుని షాపుకి ఎట్లా వెళ్తాం?"

"మనం సాధువులమనో, వారి శిష్యులమనో చెప్దాం. వాళ్ళు మనల్ని నమ్మి మనికి ఉండటానికి స్థలం కూడా ఇవ్వొచ్చు."

"కానీ తెల్లారేటప్పటికి ఓడ వెళ్ళిపోతే..."

"ఔను కదా! నేను దాన్ని గురించి ఆలోచించనే లేదు."

మేము అలా కూర్చుని మాట్లాడుకుంటుంటే, ఇద్దరు రైల్వే పనివాళ్ళు అటు నడిచి వెళ్తూ కనిపించారు. వాళ్ళు పల్లెటూళ్ళో రైతులకి మల్లే కాకుండా పాంటు, షర్టు వేసుకున్నారు. వాళ్ళు బట్టలు విప్పి, నీటిలో స్నానానికి దిగారు. వాళ్ళను చూడగానే నాకొక దుర్బుద్ధి పుట్టింది.

"దల్‌జిత్, నీకు వాళ్లు కన్పిస్తున్నారా?" అని అడిగాను.

"కన్పిస్తున్నారు" అన్నాడు. కానీ వాడికి నేనేం చెప్తున్నానో అర్థమై పోయింది. మేము మెల్లగా వెళ్ళి ఆ బట్టల్ని తీసుకుని పారిపోయాము. వాళ్ళకు కనిపించినంత దూరం పోయి వాటిని తొడుక్కున్నాము. అవి మా సైజు కంటే బాగా పెద్దవి!

## జామ్‌నగర్!

రెండుగంటల తర్వాత మేము జామ్‌నగర్ లో వున్నాము.

ఒక చిన్న టీ కొట్టు దగ్గర కొంతమంది లడ్డూలు, భేల్‌పురి తింటున్నారు. మా దగ్గర డబ్బు లేదు.

"ఇక్కడ రేవు ఎక్కడుంది" అని షాపువాణ్ణి అడిగాను.

"ఇంకో రెండు మైళ్ళ దూరంలో."

"రేవులో ఓడలున్నాయా?"

"ఓడలెందుకు?"

"ఓడలెందుకు? ఎక్కివెళ్ళేందుకే!"

"అలాగయితే అక్కడ ఒక ఓడ బయలుదేరాటానిక సిద్ధంగా వుంది. త్వరగా వెళ్ళండి."

"పద" అన్నాడు దల్‌జిత్.

"ఆగండి. మీరు నడిచి వెళ్తే అందుకోలేరు. ఇక్కడొక గుర్రబ్బండి వుంది. దాంట్లో వెళ్ళండి" అన్నాడు అక్కడున్న ఒకతను.

"కానీ మా దగ్గర డబ్బులేదే" అన్నాను.

"ఒక అర్ధ రూపాయి, అరకప్పు టీ ఇప్పించండి. తీసికెళ్తాను" అన్నాడు.

సరే అని ఎక్కాము. కానీ మేము వెళ్ళేటప్పటికే ఓడ కదులుతోంది. "కెప్టన్, అంకుల్ జిమ్" అన్న మా అరుపులు గాలిలో కలిసిపోయాయి. నా

దల్‌జీత్ వైపు చూసాను. అతని నవ్వు మొహం నాకు ఆశ్చర్యం కలిగించింది.

"పోన్లే, ఒక ఐదు నిమిషాలు ఆలస్యంగా వచ్చాము. మనం వచ్చేటప్పు రహస్యం గా పారిపోయి వచ్చాము. కానీ ఇప్పుడు ధైర్యంగా వెళ్ళొచ్చు. బొంబాయిలోని మా అంకుల్‌కి టెలిగ్రాము ఇస్తే వచ్చి తీసికెళ్తాడు."

కాని నా ఆలోచనలు మళ్ళీ వచ్చే ఏడాది అంకుల్ జిమ్ తోటే, ఆలస్యంకాకుండా వెళ్ళిపోవాలి అనిపించింది.

వేసంగి ఎంతో దూరం లేదనిపించింది. ఆ సముద్రాన్ని చూస్తుంటే ఈ ఏడాదో, వచ్చేడో-యొకోహామా, వాల్‌పెరైసో, సాన్‌డియాగో... లండన్...



Printed at Beauty prints, New Delhi-110 055